


సంపుటి: 2 సంచిక: 4 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 జూలై 2016



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhra Pradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

వీరాంజనేయులు : 7799260684

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖ చిత్రం: తపం

చిత్రకారుడు : వీరాంజనేయులు

84

## పరిచయం..

బాగున్నారా, అంతా?

సెలవలన్నీ గబగబా, హడావిడిగా, గందరగోళంగా, సంతోషంగా గడిచి ఉంటాయి కదూ? చాలా కథలు చదివి ఉంటారు, క్రొత్త క్రొత్త ఆటలు, పాటలు నేర్చుకొని ఉంటారు. మండే ఎండల్లో తిరగకుండా జాగ్రత్తగా ఆడుకున్నారుగా?

కొత్తపల్లి కోసం ఎదురు చూసారా, పాపం? పత్రిక వచ్చి ఉంటే బాగుండేది కానీ, ఏంచేద్దాం, ఎండలు కదా, ఈ రెండు నెలలూ కుదరలేదు. ఇప్పుడు మళ్ళీ కొన్ని చక్కని కథలు పట్టుకొని వచ్చేసాం, ఇవిగో! !

ఈ కథలన్నీ చదవెయ్యండి గానీ- ఇదిగో, ఇందులో 'మొక్కలు నాటే కథ' అని ఓ గొప్ప కథ ఉంది. అది మాత్రం తప్పకుండా చదవండి- చదివి, ఈ వానాకాలంలో వీలైనన్ని మొక్కలు పెంచండి!

అదికాక, ఇందులో ఉజ్బెకిస్తాన్ వాళ్లది 'బాకీ' అని ఓ మాంఛి పెద్ద కథ ఉన్నది. పెద్ద పిల్లలు చదివేందుకు భలే ఉంది. చదివి ఆలోచించాలి మరి!

ఇంకేమి- మామూలేగా, మీరు రాసిన కథలేమైనా ఉంటే పంపండి! మీ పెద్దవాళ్లతో కూడా రాయించండి! బాగున్నవాటిని దిద్ది, రానున్న నెలల్లో ప్రచురిస్తాం!

కొత్తపల్లి బృందం




---

చదువనివాడజ్ఞుండగుఁ
చదివినఁ సదసద్వివేక చతురత గల్గున్
చదువగవలయును జనులకు
చదివించెద నార్యులొద్దఁ చదువుము తండ్రీ!

భావం: బమ్మెర పోతన, భాగవతంలో, హిరణ్యకశిపుడి చేత ప్రహ్లాదుడికి చెప్పిస్తున్న మాటలు:
చదవని వాడు ఒట్టి మూర్ఖుడు అవుతాడు.
నాయనా! చదివితే 'ఏది మంచి, ఏది చెడు' అనేది తెల్సుకునే విచక్షణ వస్తుంది.
అందువల్ల, ప్రతి ఒక్కరూ చదువుకోవాలి.
నేను నిన్ను మంచి గురువుల వద్దకు పంపిస్తాను- బాగా చదువుకో తండ్రీ!

*-సౌజన్యం: పోటు బాల్‌రెడ్డిగారు, భీమారం.*



# అబద్ధాలు!

*ఈసారి ఆలోచింపజేసే రచనలు ఏమున్నై, అని చూస్తుంటే ఇదిగో, ఈ కథ దొరికింది - చూడండి...*
*మూలం : మానస, ఎనిమిదవ తరగతి, జహీరాబాదు.* *కథనం, ముగింపు : కొత్తపల్లి*
*సౌజన్యం : మన లైబ్రరీ, జహీరాబాదు*

అనగనగా ఒక ఊరు. ఆ ఊరిలో ఒక బడి. ఆ బడిలో మంచి మాస్టారుగారు ఒకాయన ఉండేవాడు. ఆయన పేరు బాలాజీ రావు.

టీచర్ల యూనియన్లలో ఆయనకు చాలా మంచి పేరు, పదవి ఉండేవి. అయినా ప్రతిరోజూ క్రమం తప్పకుండా బడికి కరెక్టు సమయానికి వచ్చేవాడాయన. పిల్లలకు చాలా చక్కగా పాఠాలు చెప్పేవాడు. సరైన సమయానికి సిలబస్ మొత్తం పూర్తి చేసేవాడు. చదువుతో పాటు, పిల్లలకు జీవితానికి సంబంధించిన విలువలు నేర్పేవాడు. అందుకోసం ఆయన రకరకాల ప్రయోగాలు చేస్తుండేవాడు.

వాటిలో భాగంగా ఒకరోజున ఆయన పిల్లలందరిని పిలిచి "చూడండి పిల్లలూ! మనందరం ప్రతిరోజూ ఏదో ఒక విషయం

గురించైనా అబద్ధాలు చెబుతుంటాం. అవునా, కాదా?" అని అడిగాడు.

"అవును సార్!" ఒప్పుకున్నది లక్ష్మి.

"లేదు సార్! నేను అస్సలు అబద్ధాలు చెప్పను- కావాలంటే మా అమ్మని అడగండి" అన్నాడు రవి.

వెంటనే పిల్లలంతా కొందరు "మేం చెబుతాం" అనీ, కొందరు "మేం చెప్పం" అనీ గోలగోలగా అరిచారు.



"సరే! సరే! మీలో కొందరు అబద్ధాలు ఆడుతున్నారు; కొందరు ఆడట్లేదు. కానీ ఆ సంగతులేవీ నాకు ఇన్నాళ్ళుగా తెలీదు. ఎందుకు తెలీదు, చెప్పండి?!" అడిగారు బాలాజీరావు మాస్టారు.

"ఎందుకంటే మీరు ఇంతకు ముందు ఎప్పుడూ మమ్మల్ని అడగలేదు" సూటిగా అనేసాడు సూరి.

"అవును సార్! మమ్మల్ని అడిగి ఉంటే మేం చెప్పేవాళ్లం, నిజంగా!" అన్నది కల్యాణి, ముసి ముసిగా నవ్వుతూ.

"లేదు సార్! అడిగినా ఎవ్వరూ చెప్పరు" అన్నాడు సురేష్ "ఊరికే అబద్ధాలు చెప్పేస్తారు!" అని పెదవి విరుస్తూ.

"మరి, అబద్ధాల గురించి తెలుసుకోడానికి ఇంక వేరే మార్గం ఏమున్నది?" అడిగారు మాస్టారు నవ్వుతూ.

పిల్లలంతా ఆలోచనలో పడ్డారు.

"వేరే ఏమీ దారి లేదు. నేను మీ మాటని నమ్మదలచుకున్నాను అంతే. ఇప్పటినుండి ఒక నెలరోజులపాటు ప్రతిరోజూ నేను మిమ్మల్ని అడుగుతాను- క్రితం రోజున ఎవరు ఎన్ని అబద్ధాలు చెప్పారో నాకు చెప్పాలి ఒక్కొక్కరే. మీరు ఏది చెబితే దాన్ని ఇదిగో, ఈ నోట్సులో రాసుకుంటాను. నెల పూర్తయ్యాక, ఎవరు తక్కువ అబద్ధాలు చెబుతారో వాళ్లకు ఒక చిన్న బహుమతి"

"బహుమతి కోసం కావాలని ఊరికే

అబద్ధాలు చెప్పినా చెప్పలేదని చెబుతారు సార్!" అరిచాడు సూరి అసంతృప్తితో.

"చెప్పినా, చెప్పకపోయినా, చెప్పక తప్పదని చెప్పేసినా, చెప్పుదామనుకున్నా, అన్నీ చూసుకునేందుకు నేను ఉన్నాను కదా!" అని నవ్వారు బాలాజీరావుగారు.

***

తరువాతి రోజున మాష్టారు గారు క్లాసుకు రాగానే ఒక్కొక్కరిని లేపి, "ఎన్ని అబద్ధాలు ఆడావు?" అని అడిగారు. ఒకరు "నేను 24 అబద్ధాలు ఆడాను" అని అన్నారు. వెంటనే మాష్టారు "నీకు పదికి 9 మార్కులు" అన్నారు.

రెండోవాడు నేను 18 అబద్ధాలు ఆడాను" అన్నాడు.

వెంటనే మాస్టారు "అయితే నీకు కూడా 9 మార్కులు" అన్నారు.

"నేను అస్సలు ఒక్క అబద్ధం కూడా ఆడలేదు సార్" అన్నాడొక పిల్లవాడు.

"నిజంగానా?!" అన్నారు మాస్టారు ఆశ్చర్యంగా.

"నిజ్జమంటే నిజం సార్" అన్నాడు వాడు.

"అయితే నీకు పదికి పది మార్కులు! అందరూ వీడికోసం చప్పట్లు కొట్టండి" అన్నారు బాలాజీరావు మాస్టారు.

వాడు చాలా గర్వంగా ఫీలయి కొంచెం నిటారుగా కూర్చున్నాడు.

తర్వాత పిల్లాడు "నేను కూడా అస్సలు అబద్ధం చెప్పలేదు సార్" అన్నాడు నవ్వుతూ.

"అయితే నీకు 2 రెండు మార్కులు" అన్నారు మాస్టారు కూడా నవ్వుతూ.

వాడు ఆశ్చర్యపోయి చటుక్కున కూర్చున్నాడు.

అట్లా మొదలైన ఆ కార్యక్రమం నెల పొడుగునా సాగింది.

నెల గడిచాక బాలాజీరావు మాస్టారు రిజిస్టరును పిల్లలకే ఇచ్చి, ఎవరి అబద్ధాల మార్కుల్ని వారు కూడి మొత్తం చేయమన్నారు.

కొందరికి ఎక్కువ మార్కులు, కొందరికి తక్కువ మార్కులు వచ్చాయి. కొంతసేపు అందరూ గొడవ గొడవగా వాళ్లకొచ్చిన మార్కుల మంచి చెడ్డల గురించి

మాట్లాడుకున్నారు. కొందరు పిల్లలు మాస్టారి దగ్గరకొచ్చి నిలబడి, "మేం అసలు అబద్ధాలు చెప్పకపోయినా మీరు మాత్రం మాకు తక్కువ మార్కులే ఇచ్చారు సార్" అన్నారు ఏడుపు ముఖాలతో.

"చూడండి, మీరందరూ చాలా మంచి పిల్లలే. పోయి కూర్చోండి. ఈ మార్కులన్నీ ఒట్టివే. ఎందుకో నేను చెబుతాను, వినండి. ముందు వెళ్ళి కూర్చోండి" అని వాళ్లందరినీ వెనక్కి పంపి కూర్చోబెట్టి, అప్పుడు చెప్పారు- "చూడండి పిల్లలూ, నిజంగానే మనందరం ఎప్పుడో ఒకసారి అబద్ధాలు ఆడుతుంటాం. కానీ వాటిని ఏనాడూ లెక్క పెట్టుకోం. నిజానికి గాంధీగారు మహాత్ముడు ఎందుకో తెలుసా? ఆయన తను ఆడిన అబద్ధాలను లెక్క పెట్టుకున్నాడు: వాటి పట్ల మెలకువతో వ్యవహరించాడు. వాటిని గుర్తించనట్లు, మర్చిపోయినట్లు, 'అవి నిజాలే' అన్నట్లు ప్రవర్తించలేదు. అబద్ధాలను ఎప్పటికప్పుడు అబద్ధాలుగా గుర్తించటం జరుగుతుంటే, అవి మనల్ని అతుక్కొని ఉండలేవు. 'మనం గమనిస్తున్నాం కదా' అని మెల్లగా అబద్ధాలు అన్నీ పారిపోతై; మనం రాను రాను సత్యవంతులం అవుతాం. ఈ నెలరోజుల్లోనూ జరిగింది అదే. మనందరం మనల్ని మనం గమనించుకున్నాం.



ఎవరం ఎన్ని అబద్ధాలు ఆడామో ఎవరికి వాళ్లం మన మనసులో సరిగ్గానే లెక్క వేసుకున్నాం. నోట్సులో ఉన్న అంకెలేవీ వాస్తవం కాదు- మీ మనసుల్లో ఏ రోజుకారోజున లెక్క ఒకటి ఉండింది చూసారా, అదే వాస్తవం. మీలో ప్రతి ఒక్కరూ గుర్తించి ఉంటారు- నెల మొదట్లో కంటే, నెల చివర్లో మీరు తక్కువ అబద్ధాలు ఆడారని! ఔనా కాదా? మీరంతా ఏరోజు-కారోజు తక్కువ అబద్ధాలు ఆడేందుకే ప్రయత్నించారు- ఔనా కాదా?"

పిల్లలంతా ఔనన్నట్లు తల ఊపారు.

"అంటే మీరంతా మంచి పిల్లలైనారన్న మాట! అందుకని, మీకందరికీ వస్తై, బహుమతులు!" అని మాస్టారు తన సంచీలోంచి చటుక్కున తీసిన మిఠాయిల్ని అందరికీ పంచారు.

పిల్లల ముఖాలన్నీ సంతోష ఆశ్చర్యాలతో వికసించాయి!



**స్నేహ బంధం**

మిత్రమా మిత్రమా మిఠాయి పొట్లమా
శనగ కాయంత స్నేహమా బఠానీల బంధమా
నిన్ను చూడాలని ఉంది నీతో మాట్లాడాలని ఉంది
బస్సులో వస్తే రోడ్డు ప్రమాదం
రైల్లో వస్తే పట్టాల ప్రమాదం
విమానంలో వస్తే గాలి ప్రమాదం
అందుకే బాదం కాయంతా బాధతో
ఉసిరి కాయంత ఉత్తరం రాస్తున్నాను
పేరు వెసరికాయ ఊరు ఉసిరికాయ
జిల్లా జీడికాయ మండలం మామిడి కాయ
చిరునవ్వు చింతకాయ

*-కె.కీర్తన, 10వ తరగతి, కెజిబివి, సికెపల్లి.*

నవ్వు!



# నెమలి నేర్పిన నడకలు

*ఈ కథ గమనం చూసారా ? కూసింత భావుకత, రవ్వంత సృజనాత్మకత ! ఎంత అందం వచ్చేస్తుంది !!*
*సృజన : జి. లక్ష్మి భవాని, ఎనిమిదవ తరగతి, శాంతినికేతన్ విద్యాలయ, జహీరాబాదు.*

ఓ పచ్చటి కోన అంచున 'నెమలి కోన' అని ఓ చిన్న పల్లె. కోన వైపున ఉన్న చివరి ఇంట్లో ఓ అందమైన పాప పుట్టింది. ఆమెకు 'మయూరి' అని పేరు పెట్టారు.

మూడేళ్లు నిండబోతున్నా, ఆ పిల్లకు నడకరాలేదు. నేలమీద దోగాటడమే తప్ప, ఒక్కసారైనా లేచి నిలబడలేదు. ఇరుగు-పొరుగు వాళ్ళు ఆ పాపను 'మయూరి-మయూరి' అని పిలుస్తుంటే తమ బిడ్డను వ వెక్కిరిస్తున్నట్లుగా అనిపించేది వాళ్ల అమ్మకి, నాన్నకి.

ఆ యేడు తొలకరి వానలు మొదలైనాయి.

ఓ నాటి సాయంత్రం పావుగంట సేపు వాన కురిసి ఆగింది. ఇంట్లోంచి మయూరి దోగాడుతూ వాకిట్లోకి వచ్చింది. మామూలుగా కోనలో తిరిగే ఓ నెమలి అప్పుడు ఇంటి ముందుకు వచ్చి నిలబడింది. మెడ తిప్పుతూ, పాప కళ్లలోకి సూటిగా చూసింది. మెల్లగా పాప దగ్గరికి వచ్చి, ఆమె చుట్టూ వయ్యారంగా

నడవసాగింది.

మయూరి దాని వెంట దోగాడుతూ పోయింది. చేతులు చాపి దాన్ని పట్టుకోబోయింది. అది అందలేదేమో, చటుక్కున లేచి నిలబడింది. నెమలి పరుగుతీసింది. పాప తల్లి ముఖం కలువ పువ్వుబోయింది. ఆమె సంతోషంతో చప్పట్లు చరిచింది. పాప చప్పున చతికిల బడింది.



మరునాటి సాయంత్రం తడినేలలో కాలి ముద్రలు వేసుకుంటూ మళ్లీ వచ్చింది నెమలి. ఈసారి అది పాప చుట్టూ కొంచెం వేగంగానే నడుస్తూ వయ్యారాలు ఒలకబోసింది. మయూరి దానికేసే చూస్తూ కాసేపు ఆడుకొంది. అందుకోవాలనుకున్నది. ఒక్కసారిగా తటాలున లేచి నిలబడింది. చక చకా నాలుగు అడుగులు వేసి దాన్ని పట్టుకోబోయింది. నెమలి పరుగు అందుకున్నది. పాప తుపుక్కున కూలబడింది.

మూడో రోజున మళ్ళీ వాన కురిసాక, ఆకాశంలో ఏడు రంగుల ఇంద్ర ధనస్సు వెలిసింది. ఇప్పుడు నెమలి కోసం ఎదురుచూస్తూ నుంచున్నది మయూరి. రానే వచ్చింది నెమలి!



పాప ఎదుట నిలబడి, ఒళ్లు విదిలించుకుంది. మెల్లమెల్లగా పురివిప్పింది.

మనోహరంగా నాట్యం చేసింది. నాట్యం పూర్తయ్యేసరికి మయూరి లేచి నెమలి చెంతకు పరుగుతీసింది. అందకుండా పారిపోయింది నెమలి.

ఇప్పుడది రోజూ వస్తూనే ఉంటుంది. పాప దాని వెంట పరుగులు తీస్తుంది కానీ, పడిపోదు. నెమలిని సున్నితంగా పట్టుకుంటుంది. అది కూడా సుతారంగా విడిపించుకుంటుంది.

వాన వెలిస్తే చాలు- ఇద్దరూ నెమలికోనలో ఒకరినొకరు తరుముకుంటూ కనిపిస్తారు. ఎవరైనా 'మయూరీ!' అని పిలిస్తే నెమలి వెనక్కి తిరిగి చూస్తుంది. అప్పుడు "ఓయ్! వాళ్ళు పిలిచింది నిన్ను కాదు- నన్ను!" అంటుంది మయూరి ఎగతాళిగా!



**స్వాగతం!**

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

**తెలివైన అద్దాలు!**

అమ్మ: ఒరే, నాయనా! ఓ మంచి అద్దం కొని పట్టుకురారా, నా బొట్టు ఎలా ఉందో చూసుకోవాలి!

వెంగళప్ప(ఒక అరగంట తర్వాత) : లేదమ్మా! నేను బజారులో అంతటా వెతికాను.... ఏ అద్దంలో చూసినా నా ముఖమే కనిపిస్తోంది తప్ప, ఏ ఒక్కటీ నీ బొట్టు ఎలా ఉందో చూపించటమే లేదు!

నవ్వు!



# స్నేహం



*రచన: పల్లెం శ్రావణి, ఏడవ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కంకణాల పల్లి, ప్రకాశం జిల్లా.*

ప్రహరి, ప్రియాంక మంచి స్నేహితులు. వాళ్ల స్నేహాన్ని చూసి ఓర్వలేని కావ్య వాళ్లు చేసే ప్రతి పనిలోనూ **పానకంలో పుడక** లాగా అడ్డు తగలడం మొదలు పెట్టింది. వాళ్ళిద్దరినీ ఎలాగైనా విడదీయాలని **భగీరథ ప్రయత్నం** మొదలు పెట్టింది. ఒకరిమీద ఒకరికి చాడీలు చెప్పటం మొదలు పెట్టింది.

అయితే ఈ విషయం ప్రహరి, ప్రియాంక ఇద్దరూ గుర్తించారు. అందుకని వాళ్ళు కావ్యని అసలు పట్టించుకోకుండా తమ పని తాము చేసుకుంటూ పోసాగారు.

ఒక రోజున తెలుగు అయ్యవారు వచ్చి "ఇవాళ్ళ ప్రశ్నలకు జవాబులు చెప్పుకుందాం. నోట్సులు తీయండి" అన్నారు. ప్రహరి తన పుస్తకాల సంచీలో చూసుకుంటే నోట్సు లేదు! ఆమె ముఖం తెలవెలపోయింది. వెనక వరసలో ఉన్న కావ్య ఇది గమనించి "ఇందాక ప్రియాంక తీసుకున్నట్లున్నదే, నీ నోట్సును?!" అన్నది గుసగుసగా. సరిగ్గా అదే క్షణంలో ప్రహరికి గుర్తుకొచ్చింది-

'ఉదయం తను చదువుకున్నాక నోట్సును ఇంట్లో కుర్చీలో పెట్టి మర్చిపోయింది కదా, తను?!' అందుకని ఆమె చిరునవ్వుతో ప్రియాంకవైపు తిరిగి, "నేను ఇవాళ్ళ నోట్సు మరచిపోయి వచ్చినట్లున్నాను, నువ్వు రాసుకున్న నోట్సును ఇంటికి ఇచ్చావంటే, రేపు ఉదయాన్నే తెచ్చిస్తాను" అన్నది. "ఓ! దానిదేముంది, తప్పకుండా తీసుకెళ్ళు" అన్నది ప్రియాంక. వింటున్న కావ్య **ముఖం మాడిపోయింది.**



మరొకరోజున ఆటల్లో ప్రహరి, ప్రియాంకలు ఇద్దరూ వేరు వేరు బృందాలలో పడేట్లు చేసింది కావ్య. ఇద్దరూ పోటీ పడి ఆడటం చూసి, "అబ్బ! ఇప్పుడిక స్నేహం చెడుతుంది. గెల్చినవాళ్ళు ఓడిన వాళ్లని **చిన్న చూపు చూస్తారు**గా; ఓడినవాళ్ళు **మూతిముడుచుకుంటారు**" అనుకున్నది. కానీ ఆట అయిన వెంటనే ప్రహరి, ప్రియాంక ఇద్దరూ గట్టిగా నవ్వుకొని, "ఇవాళ్ళ ఆట భలే ఉంది కదూ, రోజూ ఇట్లా వ్యతిరేక పక్షాలలోనే ఆడదాం మనం. అట్లా ఇద్దరమూ బాగా ఆట నేర్చుకోవచ్చు!" అంటూ ఒకరి భుజాల మీద ఒకరు చేతులు వేసుకొని చక్కా పోయారు!

చూస్తున్న కావ్య నాలుక కరచుకున్నది గానీ, వాళ్ల పట్ల ద్వేషభావం మటుకు ఆమెలో ఏమాత్రం తగ్గలేదు.

ఒక రోజు తెల్లవారుజామున్నే కావ్య వాళ్ళ అమ్మానాన్నలు అకస్మాత్తుగా ఊరికి పోవలసి వచ్చింది. దాంతో కావ్య ఏమీ తినకుండానే బడికి వచ్చింది: "బడిలో ఎట్లాగూ మధ్యాహ్న భోజనం ఉంటుంది కదా!" అనుకున్నది ఆ పాప.

అయితే ఆ రోజున ఎందుకనో పాఠశాలలో మధ్యాహ్నం భోజనం పెట్టలేదు. "ఇవాళ్ళ మీరంతా మీ మీ ఇళ్లకు వెళ్లి తిని రావలసి ఉంటుంది" అని ఉదయాన్నే అసెంబ్లీలో చెప్పారు. "ఏమీ పర్లేదులే" అనుకున్నది కావ్య. అయితే మధ్యాహ్నం అయ్యేసరికి

ఆమె **కడుపులో ఎలుకలు** పరుగెత్తసాగాయి. ఇంటికి వెళ్దామంటే ఇంట్లో అమ్మ-నాన్నలు లేరు! ఆ ఆలోచనతోటీ, నీరసంతోటీ ఆమె కళ్ళు తిరిగాయి. లేచి నిలబడిన కావ్య టక్కున తూలి పడబోయింది!



అయితే ప్రహరి-ప్రియాంక ఇద్దరూ ఆమెను పడకుండా పట్టుకున్నారు. ఆమెను కూర్చోబెట్టి, ప్రేమగా మాట్లాడి సంగతి తెలుసుకున్నారు. "దానిదేమున్నది, మా యింటికి రా!" అని ప్రహరి ఆమెను వాళ్ళింటికి తీసుకెళ్ళింది. వాళ్ళ అమ్మ తనకోసం చేసి పెట్టిన భోజనం పెట్టింది.

ఆ తర్వాత ముగ్గురూ కలిసి ప్రియాంక వాళ్ల ఇంటికి వెళ్ళారు. తన వంతు భోజనంలో సగాన్ని ప్రియాంక ప్రహరికి పెట్టింది.



వాళ్ల ఆప్యాయతని చూసి కావ్య మనసు కరిగిపోయింది. 'తన పట్ల వాళ్లకు ఏమాత్రం ద్వేషభావం లేదు' అన్న ఆలోచనతో ఆ పాప కళ్ళలో నీళ్ళు తిరిగాయి. 'వాళ్ళని విడగొట్టాలని తను ఎందుకు, అంత ప్రయత్నించింది?' అని సిగ్గు పడింది. అటు తర్వాత తన మంచి ప్రవర్తనతో వాళ్ళకు తగిన స్నేహితురాలుగా తనూ ఎదిగింది. ఇప్పుడు "ప్రహరి-ప్రియాంక-కావ్య ముగ్గురూ మంచి స్నేహితులు" అని అందరూ చెప్పుకోవటం మొదలెట్టారు!





# మొక్కలు పెంచే కథ



*భలే చెప్పారు- "అడవికి ఉత్తరం దిక్కున ఉన్న ఎడారిలో 125 మొక్కలు నాటాలి!" మనందరమూ కూడా చెయ్యాల్సిన పని కదూ, అది ?!*

*రచన: జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల పిల్లలు, కంకణాల పల్లి, ప్రకాశం జిల్లా*

అనగనగా కంకణాలపల్లిలో ప్రియ, లలిత అనే స్నేహితులు ఇద్దరు ఉండేవాళ్ళు. వాళ్ళ ఇంటికి దగ్గర్లోనే ఒక ఆట స్థలం, ఓ చిన్న తోట ఉండేవి. వాళ్ళు రోజూ ఆ తోట అంతా కలయ తిరిగి మైదానంలో ఆటలాడి వచ్చేవాళ్ళు.

ఒకరోజున వాళ్ళు వెళ్ళే సరికి ఎవరో పెద్దవాళ్ళు కొందరు తోట అంచున మొక్కలు నాటుతూ కనబడ్డారు.

ప్రియ, లలితలు వెళ్ళి అక్కడ నిలబడి చూస్తూంటే వాళ్లలో ఒకాయన వచ్చి "ఊరికే చూసేందెందుకు? మీరు కూడా ఒక మొక్కను నాటండి" అని ఒక మొక్కను తెచ్చి చేతిలో పెట్టాడు.

ప్రియ, లలితలు సిగ్గు పడుతూనే మొక్కను నాటారు.

వాళ్లకు మొక్కనిచ్చిన ఆయన వచ్చి, దానికి నీళ్ళు పోస్తూ, "ఊరికే మొక్కలు నాటి పోతే

లాభం లేదమ్మాయిలూ, వీటిని జాగ్రత్తగా చూసుకోవాలి కూడాను. మీకు వీలైతే రోజూ దీనికి కాసిని నీళ్ళు పోసి పోతారా? ఒక్క ఏడాది కాపాడితే చాలు- ఇది బతుక్కుంటుంది" అన్నాడు.



ప్రియ, లలిత ఒకరి ముఖం ఒకరు చూసుకొని 'సరే' అన్నారు. అప్పటినుండి వాళ్ళు ప్రతిరోజూ దానికి చెంబెడు నీళ్ళు పోయటం మొదలెట్టారు. ఆ మొక్క కూడా, విచిత్రం, చాలా తొందరగా, చక్కగా పెరిగింది. సంవత్సరం తిరిగేసరికి దానికి చిట్టి చిట్టి కాయలు కూడా కాయటం మొదలెట్టాయి!

ఒకరోజు సాయంత్రం ప్రియ, లలిత ఇద్దరూ మొక్కకు నీరు పోస్తుంటే "మీకు కృతజ్ఞతలు" అని ఎవరో వాళ్లకు దగ్గరనుండి అన్నట్టుగా వినిపించింది. ప్రియ, లలిత ఇద్దరూ ఉలిక్కిపడి చుట్టూ చూసారు. "ఎవ్వరూ లేరే!" అనుకొని మళ్ళీ మొక్కకు నీరు పోయసాగారు. ఇంతలో ఆ మొక్క ఊగుతూ "కంగారు పడకండి- నేనే, ఇందాక మీకు కృతజ్ఞతలు తెలిపింది" అన్నది.

ప్రియ, లలిత ఇద్దరూ నిర్ఘాంత పోయారు. "మొక్క మాట్లాడటం ఏమిటి?" అని గబుక్కున వెనుతిరిగి పారిపోయారు ఇద్దరూ.

అయితే ఆ మరునాడు సాయంత్రం వాళ్ళు తోటకు వెళ్ళే సమయానికే ఆ మొక్క దగ్గర ఒక దేవత ప్రత్యక్షమైంది. వీళ్ళు చూస్తూండగానే ఆమె మొక్కతో ఏదో మాట్లాడటం మొదలు పెట్టింది. కొద్ది సేపటికి ఆమె ఒక చేతి రుమాలు తీసి మెల్లగా కళ్ళు నీళ్ళు తుడుచుకున్నది!

ఇప్పుడిక లలిత, ప్రియ ఇద్దరూ ధైర్యంగా ఆమె దగ్గరికి వెళ్లి "అమ్మా! ఎవరమ్మా నువ్వు? ఎందుకు వచ్చావు ఇక్కడికి?

ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగారు.



ఆ దేవత- "నేను ఒక దేవతనమ్మా! ఇంద్ర లోకంలో ఉంటాను. నా శ్రీ స్వామిని వెతుకుంటూ వచ్చాను అక్కడినుండే" అని జవాబిచ్చింది, మళ్ళీ కళ్లు తుడుచు-కుంటూ. "మరి మీ శ్రీ స్వామి దొరికారామ్మా? ఎక్కడ ఉన్నారు? ఏం చేస్తున్నారు ఆయన?" అడిగారు పిల్లలిద్దరూ.

"ఈ మొక్కేనమ్మా, నా శ్రీ స్వామి" చెప్పింది ఆ దేవత!

ప్రియ, లలిత ఇద్దరూ ఆశ్చర్యపోయి- "ఈ మొక్కనా మీ శ్రీ స్వామి! అదేమమ్మా?! స్వామి ఇట్లా చెట్టులాగా ఎందుకుంటారు?" అని అడిగారు.

ఆ దేవత మళ్ళీ ఒకసారి కళ్ళు నీళ్ళు తుడుచుకొని "ఏం చెప్పమంటారు?! సంవత్సరం క్రితం ఒక రోజు నేను-నా శ్రీ స్వామి ఇద్దరం భూలోక విహారానికి వచ్చాము. కులాసాగా మాట్లాకుంటూ ఆ కనిపిస్తోందే, పవిత్రమైన అడవి- అందులోకి వెళ్లాము.

ఆ సమయంలో బాగా చలిగా ఉంది. నేను వణికి పోతూన్నాను. అప్పుడు నా శ్రీ స్వామి నవ్వుతూ అక్కడున్న ఒక పచ్చని చెట్టును కొమ్మలతో సహా నరికి ముక్కలు చేసి, వాటితోటే మంట వేసారు. నేను వద్దంటూనే ఉన్నాను, కానీ ఆయన విననేలేదు!

అంతలోనే అక్కడికొక్క మహాముని వచ్చాడు- 'మూర్ఖుడా! పచ్చని చెట్టును కొట్టి ఎనలేని పాపం మూటగట్టుకున్నావు. నీకే శక్తి ఉందన్న ధీమాతో ఆ పచ్చని చెట్టునే తగలబెట్టావు. నా తపస్సుకు భంగం కలిగించావు. ఇందుకు ఫలితం అనుభవించకపోతే నీకు బుద్ధిరాదు. నువ్వు

కూడా ఒక మొక్కగా మారిపో! నీకు, నీ భార్యకు ఎన్ని మంత్ర శక్తులున్నా అవేవీ మీకు ఉపయోగపడకుండుగాక!' అని శపించాడు.

నేను వెంటనే ఆయన కాళ్ల మీద పడి కరుణించమని వేడుకున్నాను.

ఆ మహానుభావుడు చల్లబడి, 'తల్లీ! చేసిన పాపం ఊరికే పోదు. ఈ అడవికి ఉత్తరం దిక్కులో ఉన్న ఒక ఎడారిలో 125 మొక్కలు నాటితే నీ స్వామికి విమోచనం అవుతుంది. ఐతే ఆ పని నువ్వు చేయలేవు- ఎవరైనా మానవులు, మీ మీద ప్రేమతో ఆపని చేసి పెట్టినప్పుడే నీ భర్తకు విముక్తి" అని సెలవిచ్చాడు'" చెబుతుంటే దేవత కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి.

"నువ్వేమీ బాధ పడకమ్మా! మేం నీకు సాయం చేస్తాం. మేం వెళ్ళి ఆ మొక్కలు నాటుతాంగా, ఈ వారంలోనే!" అని ఆమెకు ధైర్యం చెప్పారు.

మరునాటినుండీ  ప్రియ, లలిత ఇద్దరూ మంచి మంచి మొక్కల్ని సేకరించటం మొదలెట్టారు. పెద్దగా పెరిగేవి, ఎండల్ని తట్టుకునేవి, పశువులకు ఉపయోగపడేవి- ఇట్లా రకరకాల మొక్కలు సంపాదించారు. అన్నిటినీ ఉత్తరం దిక్కున ఉన్న ఇసుక భూమిలోకి చేర్చారు.

మరుక్షణం అక్కడొక ఇసుక తుపాను మొదలైంది. వీళ్ళు చూస్తూండగానే అక్కడో సుడిగాలి, అందులో ఒక ఇసుక భూతం ప్రత్యక్షమైనాయి. పిల్లలిద్దరూ ఆ భూతాన్ని చూసి జడుసుకున్నారు.

అది వికవికా నవ్వుతూ "ఏమనుకున్నారు! మీరు ఇక్కడ మొక్కలు పెట్టలేరు! ఇక్కడ నీళ్ళు లేవు! నేను ఈ మొక్కల్ని ఉండనివ్వను! అన్నిటినీ చంపేస్తాను" అని అరిచింది.

"అందుకనే, నువ్వు భూతంలాగా ఉండిపోయావు! మొక్కలు లేని చోట్ల ఉండేది భూతాలే" అన్నది లలిత.

"అవును! ఆలోచించు! నీ భూతంరూపు పోవాలంటే నువ్విక్కడ మొక్కలు నాటాలి. ఊరికే నాటటమేకాదు- వాటికి రోజూ నీళ్ళు పోసి పోషించాలి" అన్నది ప్రియ.

"మేము ఇప్పుడు ఆ పనే చెయ్యబోతున్నాం! అది నీకూ మేలే! నీకు ఈ భూతపు రూపం

పోవాలంటే మాకు సాయం చెయ్యాలి నువ్వు. లేదంటే ఇక నీ పని ఇంతే" బెదిరించింది లలిత.



ఇసుక భూతం కొంచెం సేపు ఆలోచిస్తున్నట్లుగా నిలబడి, ఒక్కసారి కెవ్వున అరిచి మాయమైపోయింది. ఆ వెంటనే మేఘాలు వచ్చి చక్కని వానకూడా ఒకటి మొదలైంది!

లలిత, ప్రియ ఇద్దరూ సంతోషంగా గుంతలు త్రవ్వి మొక్కలన్నీ నాటారు. ఇసుకభూతం వాటికి సరిపడా వాన కురిపిస్తూ వచ్చింది. నెల రోజుల్లో ఆ మొక్కలన్నీ నిలద్రొక్కుకున్నాయి! వాళ్ళు వాటిని చూసి మురిసిపోతుండగా అక్కడ ముగ్గురు దేవతలు ప్రత్యక్షం అయ్యారు-

"ప్రియా! లలితా! మీకిద్దరికీ ధన్యవాదాలు! మీ మూలంగా మాకు ముగ్గురికీ శాపవిమోచనమైంది. ఇసుక భూతంగా పడి ఉన్న నాకు మీరు విముక్తి నిచ్చారు. నోరులేని మొక్కగా ఉన్న ఈయనకు ప్రాణం పోసారు. ఆయనకు ఏమీ సాయం చేయలేక కుమిలిపోతున్న దేవతకూ మీ మూలాన శాంతి లభించింది. మీరు చాలా మంచి పిల్లలు. ఏదైనా వరం కోరుకోండి ఇస్తాం" అన్నారు వాళ్ళు.

"మేమిద్దరం ఎప్పుడూ స్నేహితులుగా ఉండి, అన్నీ మంచి పనులే చెయ్యాలి" అని వరం కోరుకున్నారు లలిత-ప్రియ.

దేవతలు వాళ్లకి ఆ వరం ప్రసాదించి మాయమైపోయారు! 

శశిధర్: ఇంతకీ భోజనం చేశావా?'

కుమార్: అకస్మాత్తుగా ఆ అనుమానం ఎందుకు వచ్చింది?

శశిధర్: అప్పటి నుండి నా బుర్ర తింటుంటేనూ?





# పశువుల కథ



*రచన: డి.ఆర్. హిమశ్రీ , 9 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం*

చాలా ఏళ్ళ క్రితం పశువులు, జంతువులు అన్నీ అడవుల్లోనే పెరిగేవి. క్రూర జంతువులు వాటిని చంపేవి; అవేకాక మనుషులు కూడా మాంసం కోసమూ, ఇతర అవసరాల కోసమూ వాటిని వేటాడి చంపేస్తుండేవాళ్ళు. పులులు, సింహాల్లాంటి మాంసాహార, క్రూర జంతువులు వాళ్లకి అంత సులభంగా దొరికేవి కావు గానీ, పశువులు మటుకు, పాపం, అలవోకగా దొరికి పోతుండేవి.

అలా రాను రాను అడవిలో తిరిగే శాకాహార పశువుల సంఖ్య తగ్గిపోతూ వచ్చింది.

కొన్నాళ్లకు అడవిలోని ఆవులు, ఎద్దులు ఒక సమావేశం ఏర్పాటు చేసుకున్నాయి. "మనల్ని మనం కాపాడుకునేది ఎట్లాగ? మన జాతికి భద్రత లేకుండా పోతున్నదే, ఏం చేయాలి?" అని ఆలోచించేందుకు.

"మానవులు, పులుల్లాంటి క్రూరజంతువులు మన మాంసాన్ని తింటూ పండగలు చేసుకుంటున్నాయి. అందుకనే మన సంఖ్య తగ్గిపోతున్నది. ఇలా అవుతుంటే చివరికి మనం పూర్తిగా అంతరించేపోతాం. దీనికి ఏదైనా పరిష్కారం వెతకాలి" అనుకున్నాయి

అన్నీ.



వాటిలో ఉన్న కోదండం అనే ఆవు “నాకు ఒక పరిష్కారం తోస్తున్నది. నాకు తెలిసిన జింకల జంట ఒకటి ఇక్కడికి దగ్గర్లోనే ఒక ఋషి ఆశ్రమంలో ఉన్నది. ఆ ఋషి మనకు సాయం చేయగలడనిపిస్తున్నది. నేను ఆయన దగ్గరికి వెళ్ళి వస్తాను” అని బయలుదేరింది.

జింకల పరిచయంతో అక్కడికి వెళ్ళిన ఆవును నిమురుతూ ఋషి “నువ్వు ఏమి ఆశించి ఇక్కడికి వచ్చావు, కోదండం?” అని అడిగాడు.

ఆవు ఆయనకి నమస్కరం చేసి ”స్వామీ! ఈమధ్య మా ఆవుల సంఖ్య, ఎద్దుల సంఖ్య బాగా తగ్గిపోతున్నది. అడవులు మాకు నివాస యోగ్యంగా లేవు. ఒకవైపు నుండి మానవులు, మరొక వైపునుండి క్రూరమృగాలు మమ్మల్ని వేటాడుతున్నాయి. ఇప్పటికే మా సంఖ్య బాగా తగ్గిపోయింది. ఇది గనక ఇలాగే కొనసాగితే 'ఆవులు చూసేందుకు కూడా దొరకని' పరిస్థితి వస్తుంది. మీ సాయం కోరి వచ్చాను. మీరే ఏదైనా చెయ్యాలి” అని ప్రాధేయపడింది.

“నీ బాధ నాకు అర్థమైంది తల్లీ! నీ సమస్యను నేను పూర్తిగా పరిష్కరించలేక పోవచ్చు; కానీ మీ జాతికి ఒక వరం ఇవ్వగలను. ఆ వరం కారణంగా మీ జాతి నిలబడుతుంది" అన్నాడు ఋషి, కొంచెం ఆలోచించి.

“దయచేసి చెప్పండి’ అని వేడుకున్నది ఆవు.

"ప్రాణులన్నిటికీ ఒక లక్షణం ఉన్నది తల్లీ! ఏ జీవి అయినా సరే, తనకు పాలు ఇచ్చిన తల్లిని గౌరవిస్తుంటుంది, ప్రేమిస్తుంటుంది. మనిషి స్వభావం కూడా దీనికి భిన్నంగా ఏమీ లేదు. ఇకమీద నువ్వు ఇచ్చే పాలను మానవులంతా త్రాగేట్లు ఏర్పాటు చేస్తాను. అప్పుడు నువ్వు ఆ మానవులకు స్వయంగా

తల్లివౌతావు. తల్లిని పిల్లలు చంపరు కద! అలా మీ జాతికి నర భయం ఉండదు.



అంతేగాక, నీ పాలు త్రాగి ఆరోగ్యవంతులైన మానవులు మీ జాతికి రక్షకులుగా కూడా నిలుస్తారు. మిమ్మల్ని క్రూర జంతువుల బారి నుండి కూడా కాపాడతారు!" అన్నాడు ఋషి.

ఆనాటినుండి ఆవులు,ఎద్దులు మానవులకు దగ్గరయ్యాయి. ఎద్దులు వ్యవసాయంలో మనిషికి సాయం చేస్తున్నాయి; ఆవులు పాలు ఇస్తున్నాయి. మనిషి ఆవుల్ని పెంచుతున్నాడు. వాటికి క్రూరమృగాలనుండి రక్షణ కల్పిస్తున్నాడు. పశుసంపద తోడవ్వటంతోటే మానవ సమాజం గతిశీలమైంది!







టీచర్: నారు పోసిన వాడే నీరు పోస్తాడు... ఇలాంటి వాక్యం ఒకటి చెప్పు రామూ?

రాము: పాఠం చెప్పిన వాళ్లే పరీక్షలు రాస్తారు టీచర్...

పద్యం!

అల్పుడెపుడు పల్కునాడంబరముగాను- సజ్జనుండు పల్కు చల్లగాను-

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా? విశ్వదాభిరామ వినుర వేమ!



# బర్రె-పిల్లి

*"ఊరికే రూపాన్ని చూసి మోసపోకండి పాపలూ, బాబులూ, జాగ్రత్త!"*
*సేకరణ: యం.అశ్వని, ఎనిమిదవ తరగతి, పి.వి.ఆర్.జడ్.పి.హెచ్.స్కూల్, గుండువారి పల్లి, తలుపుల మండలం, అనంతపురం జిల్లా.*

అనగనగా ఒక కలుగులో ఒక చిట్టి ఎలుక, వాళ్ళ అమ్మ నివసిస్తూ ఉండేవి. చిట్టి ఎలుక పుట్టాక ఏనాడూ కలుగులోంచి బయటికి అడుగు పెట్టి ఎరుగదు- వాళ్ళమ్మ ముందుచూపుతో దానికి ఆర్నెల్లకు సరిపడా ఆహారాన్ని కలుగులో జమ చేసి పెట్టింది కదా, అందుకని.

అయితే కలుగులో పెరిగీ పెరిగీ చిట్టి ఎలుకకు బయట ప్రపంచంలో ఏముంటుందో చూడాలని కోరిక బలపడిపోయింది. ఒక రోజున అది వాళ్ల అమ్మతో "అమ్మా...అమ్మా...నేను అట్లా కొంచెం సేపు బైట తిరిగి, ఎక్కడ ఏముందో చూసి వస్తానమ్మా, ప్లీజ్!" అని అడిగింది.

వాళ్ళ అమ్మకి దాని తెలివిని చూసి ముచ్చటేసింది. "సరేలే, పోయి చూసి రా! కానీ  జాగ్రత్త, మరి- ఏది కనిపించినా దూరం నుంచే చూడు, తప్ప దగ్గరికి మాత్రం పోకు! వెనక్కి తిరిగి వచ్చాక ఏది ఎట్లా ఉందో చెప్పాలి నాకు, సరేనా?" అని హెచ్చరించి

పంపింది.



కలుగులోంచి బయటికొచ్చిన చిట్టి ఎలుకకి ఈ ప్రపంచం అంతా చాలా అందంగా కనిపించింది. ఉషారుగా పాటలు పాడుకుంటూ అది కొంచెం దూరం పోయేసరికి దానికి భయంకరమైన జంతువొకటి కనిపించింది- పెద్దగా, నల్లగా, రెండు కొమ్ములు పెట్టుకొని- అది చిట్టి ఎలుక దగ్గరికల్లా మూతి తీసుకొచ్చి ఇట్లా "ఉఫ్......" అన్నది!

చిట్టి ఎలుక కాస్త వణికి పోయి, ఎటుపోతోందో కూడా చూసుకోకుండా పరుగు పెట్టింది. అంతలోనే ఆ జంతువు గట్టిగా "బా......వ్" మని అరిచింది!

ఎలుక పిల్ల చటుక్కున దగ్గర్లో ఉన్న ఓ బండ మూలన నక్కి వెనక్కి చూసింది. ఆ జంతువు ఇప్పుడు తన ప్రక్కనే ఉన్న గడ్డిని పీక్కొని తింటున్నది: తెల్లగా మెరుస్తున్న దాని పళ్ళు గడ్డి పరకల్ని నములుతుంటే కరకరా శబ్దం వస్తున్నది.

వాటిని చూసే సరికి చిట్టి ఎలుకకు చెమటలు పోసాయి. కొద్ది సేపు దాన్ని అలాగే చూసాక అది మెల్లగా బండ వెనకకు అడుగులు వేసి, చటుక్కున కలుగు వైపుకు పరుగు పెట్టింది.

అట్లా అది కలుగు అంచుకి చేరుకుని లోనికి దూరబోతుండగానే అల్లంత దూరాన మరొక జంతువు కనిపించింది దానికి. ఇది అస్సలు భయంకరంగా లేదు. మెత్తగా, తెల్లగా, ముద్దుగా ఉంది. దానికో చక్కని కుచ్చు తోక ఉంది. కళ్ళు పచ్చగా లేత ఆకులలాగా మెరుస్తున్నాయి. సన్న గొంతుతో "మ్యా..వ్" అంటోందది!

"ఇది బలే ఉంది! వెళ్ళి దీంతో పరిచయం చేసుకుంటాను.." అనుకున్నది ఎలుక పిల్ల. కానీ అంతలోనే కలుగులోంచి చటాలున దాన్ని లోపలికి లాక్కున్నది వాళ్ళ అమ్మ. అప్పుడు అమ్మ ఊపిరి బరువుగాను, ముఖం గంభీరంగాను ఉండినై. ఎలుక పిల్లకి భయం వేసింది- "కొంచెం సేపు అమ్మని

మాట్లాడించ కూడదు" అని ఊరుకున్నది.



కొంచెం సేపటికి అమ్మ మామూలుగా అయ్యాక, అది అమ్మతో అన్నది- "అమ్మా! ఇవాళ్ల నాకు రెండు జంతువులు కనబడ్డాయి తెలుసా? ఒకటేమో మన ఇంటికి అల్లంత దూరాన ఉండింది. ఎంత నల్లగా భయంకరంగా ఉందో తెలుసా?! నామీద మూతి పెట్టి 'ఊఫ్..' అని ఊదితే, నేను ఎక్కడికో ఎగిరిపోయి పడ్డాను. ఆ తర్వాత అది 'బా...' అని ఎట్లా అరిచిందో! నేను భయపడి పోయాను" అన్నది.

"గడ్డి తింటున్నదా, అది?" అడిగింది అమ్మ ఎలుక ఊపిరి బిగబట్టి.

"అవునవును. దాని పళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి" అన్నది ఎలుక పిల్ల.

అమ్మ నవ్వింది. "దాన్ని బర్రె అంటారు. అది మనల్ని ఏమీ చెయ్యదు. చాలా మంచిదది" చెప్పింది అమ్మ.

"మరి ఇంకొకటేమో చాలా అందంగా, ముద్దుగా ఉంది. దానికో చక్కని కుచ్చుతోక, మూతికంతా మీసాలు- బలే నవ్వొచ్చింది నాకు. అది నన్ను చూడగానే "మ్యా...వ్" అని ఎంచక్కా పలకరించింది. నాకు అది బలే నచ్చిందిలే. రేపు వెళ్ళి దానితో పరిచయం చేసుకుంటాను" అన్నది చిట్టెలుక నవ్వు ముఖంతో.

అమ్మ ముఖం భయంతో వణికింది. "ఆ పని మాత్రం చెయ్యకు. దాన్ని పిల్లి అంటారు. అది మనకు శత్రువు. నువ్వు దొరికావంటే చాలు- గబుక్కున మింగేసి పోతుందది. అది కనిపిస్తే చాలు- పారిపోవాలి మనం. ఊరికే రూపాన్ని చూసి మోసపోకు పాపా, జాగ్రత్త!" అని హెచ్చరిస్తూ దాన్ని హత్తుకున్నది తల్లి ఎలుక.

పెన్సిల్ ముక్కలో లెడ్ ఉండదు. గ్రాఫైట్, బంకమట్టి మాత్రమే ఉంటాయి.

# బొమ్మకు కథ రాయండి

*ఇక్కడ ఎవరున్నారో చూసారా ?! స్నోమ్యాన్‌కి క్యారట్ ముక్కు! దాన్ని పట్టుకొని ఓ ఉడత ! చూస్తే ఇదేదో మరి ధృవ ప్రాంతం లాగా ఉంది. మరి ఈ స్నోమ్యాన్‌ని ఎవరు చేసారు? ఈ ఉడతేనా, చేస్తున్నది ?! దీని వెనక కథ ఏంటో మీకేమైనా తెలుసా? తెలిస్తే మాకు రాసి పంపండి మరి !*





# జీవనం



*రచన: పి. అనిత, అంగళ్లు పోస్టు, చిత్తూరు జిల్లా.*



రామాపురంలో లింగయ్య అనే ఒక సన్నకారు రైతు నివసించేవాడు. అతని భార్య సీతమ్మ. ఆమె చాలా తెలివైనది. వాళ్ళకు ఇద్దరు ఆడ పిల్లలు. లింగయ్య చాలా మంచివాడు. ప్రతిరోజూ తోటకెళ్లి, వ్యవసాయం చేసి కుటుంబాన్ని పోషించేవాడు.

అయితే కాలం గడిచే కొద్దీ సమస్యలు పెరిగాయి. రసాయన ఎరువుల వాడకం వల్ల నేల చెడింది. దానికి తోడు వర్షాలు దెబ్బతీసాయి. పంట నష్టం మొదలైంది.

అయినా చేసేదేమున్నది? లింగయ్య ఏ ఏటికాయేడు అప్పులు చేసి వ్యవసాయం చేయడం, నష్టపోవడం జరుగుతూ వచ్చింది. ఇంట్లో పిల్లలు కూడా పెద్దవాళ్లు అవుతున్నారు- ఖర్చులు ఎక్కువ అవుతున్నాయి. చివరికి ఇల్లు గడవటం కష్టమయింది.

అయితే అదే క్రమంలో లింగయ్య సారాయికి అలవాటు పడిపోయాడు. వెంటనే జూదం కూడా మొదలెట్టాడు.



ప్రొద్దునే సారాయి త్రాగి, రోజంతా జూదం ఆడి, రాత్రి అయ్యేసరికి మళ్ళీ తాగి రాసాగాడు. "ఏ పనీ దొరక్క పోతే కూలికి వెళ్దాం. కానీ నువ్వు సారాయి త్రాగేందుకు, జూదం ఆడేందుకు వీలు లేదు. పిల్లలు ఏమనుకుంటారు?" అని మందలించేది సీతమ్మ. అయినా లింగయ్య ఆమె మాట వినలేదు సరికదా ఊర్లో అప్పులు చేసి మరీ త్రాగి రావటం మొదలెట్టాడు. రోజంతా మత్తులో జోగే లింగయ్య అసలు ఇప్పుడిక ఇంటి పరిస్థితులను అర్థం చేసుకునే దశలో లేడు.

తాగివచ్చి సీతమ్మతో గొడవ పడటం మొదలెట్టాడు. సీతమ్మ మంచి మాటలు ఆమెకే బరువు కాసాగాయి. ఆమె ఏమన్నా లింగయ్య వినిపించుకోవట్లేదు. పొలం-వ్యవసాయం, భార్య-పిల్లల గురించి కాక, రాత్రింబవళ్ళూ సారాయి గురించే ఆలోచన.

లింగయ్య పరిస్థితిని గమనించిన సీతమ్మ ఊళ్లో కూలి పనికి పోవటం మొదలు పెట్టింది. "నేను ఆకలికి మాడితే పర్లేదు-కానీ పిల్లలున్నారు కద?" అని ఒకవైపున సీతమ్మ కూలి పని మొదలు పెడితే, అది గమనించని లింగయ్య తాగుడుకు ఇంకా బానిసై, ఊరంతా అప్పులు చేయటం మొదలెట్టాడు. చివరికి ఒక రోజున అప్పుల వాళ్లంతా ఒక్కసారిగా ఇంటిమీదకి వచ్చేసరికి, చేసేదేమీ లేక, సీతమ్మ తను దాచుకున్న కూలి డబ్బునంతా వాళ్లకి పంచేసింది.

రాను రాను లింగయ్యకు అప్పు కూడా దొరకడం కష్టం అయిపోయింది. డబ్బులు ఇవ్వమని భార్యతో రోజూ గొడవ పడటం మొదలు పెట్టాడు. అన్నింటికీ సీతమ్మ

మౌనమే సమాధానమైంది.

అన్నేళ్ళ కాపురంలో ఆమెను పన్నెత్తు మాట అనని లింగయ్య ఇప్పుడు ఆమె చర్యల్ని తప్పు పట్టటం మొదలెట్టాడు. ఇష్టం వచ్చినట్లు తిట్టటం మొదలు పెట్టాడు. సీతమ్మకు ఏం చేయాలో తోచలేదు. తన పిల్లల భవిష్యత్తు ఏమై పోతుందోనని బాధపడింది. అతన్ని బాగు పరచేందుకు ఎంత మందిని అడిగినా ఎవ్వరి దగ్గరా సరైన సలహా దొరకలేదు.

ఒకరోజు సాయంత్రం సమయంలో పూటుగా సారాయి తాగి వచ్చాడు లింగయ్య. సీతమ్మ అతన్ని పట్టించుకోకుండా తన పని తాను చేసుకోసాగింది. "ఇదిగో, నిన్నే.. వంద రూపాయలు ఇవ్వు" అన్నాడు లింగయ్య.

"దేనికి?" అన్నది సీతమ్మ.

"మగోడన్నాక లక్ష అవసరాలుంటాయి అన్నీ చెప్పాలా?" అన్నాడు లింగయ్య

"డబ్బులు అడుక్కునేవాడు అడుక్కునే-ట్లుండాలి. ఏమి అడిగితే దానికి సమాధానం చెప్పాల్సిందే. అయినా సారాయి త్రాగేందుకు నేను ఇంక డబ్బులు ఇవ్వను!" అన్నది సీతమ్మ గట్టిగా.

లింగయ్యకు కోపం వచ్చేసింది- చేతిలో ఉన్న చర్నాకోలను సీతమ్మ మీద ఝుళిపించాడు.

అంతవరకూ పిల్లిలా ఊరుకున్న సీతమ్మ ఆ క్షణంలో పులిగా మారింది. "క్షమయా ధరిత్రి" సీతమ్మ ఉగ్ర రూపం దాల్చిన మహాకాళి అయ్యింది. లింగయ్య చేతిలో చర్నాకోలను చటుక్కున లాక్కొన్నది. బొక్కబోర్లా పడిన లింగయ్యను దాంతోటే ఇష్టం వచ్చినట్లు వాయించింది.

"కష్టాలు, కన్నీళ్ళు, బాధలు ఇవన్నీ మీ మగవాళ్ళకేనా రా?! మాకు ఉండవా? మీ బాధల్ని మర్చిపోయేందుకు మీరు త్రాగుతారా? ఎన్ని కష్టాలు ఎదురైనా మరి మేమెందుకు త్రాగం రా?! ప్రశ్నంతా 'బాధ్యత' గురించేరా! మీకు బాధ్యత లేదు- మాకు ఉన్నది. ఇంటిని, పిల్లల్ని అందరినీ ప్రక్కన పెట్టేసి సారాయి మత్తులో ఊగేందుకు సిగ్గు లేదురా, మీకు?" అని గద్దిస్తూ చెలరేగిన సీతమ్మ ముఖంలోకి కూడా చూడలేకపోయాడు లింగయ్య.

ఆమె అరుపులు విని ఇరుగు

పొరుగులందరూ పరుగెత్తుకొచ్చారు. ఝాన్సీ లక్ష్మిలాగా యుద్ధం చేస్తున్న సీతమ్మను ఆపేందుకు ప్రయత్నించారు. "మగవాళ్ళంతా ఇంతే" అని సర్ది చెప్పబోయిన ఇరుగు-పొరుగులందరికీ కూడా బాగా గట్టిగానే సమాధానం ఇచ్చింది సీతమ్మ. "చూస్తూండండి- ఇవాల్టి తర్వాత ఇతను తాగి వచ్చినప్పుడల్లా ఇలాగే కొడతాను. ఎవరు ఏం చేస్తారో చూస్తాను" అంటూ మళ్ళీ ఒకసారి వాయించింది లింగయ్యను. ఆమెకు సమాధానం చెప్పలేక అందరూ నోళ్ళు వెళ్ళబెట్టారు.

కొద్ది సేపటికి తన కోపం చల్లారాక, మెల్లగా తనే పోయి డాక్టరును పిల్చుకొచ్చి భర్తకు వైద్యం చేయించింది సీతమ్మ. "ఇదిగో చెబుతున్నాను- రేపు త్రాగి వచ్చావంటే మళ్ళీ దెబ్బలే" అని బెదిరిస్తూ. అయితే ఆమెకు ఇక మళ్ళీ చెయ్యి చేసుకోవలసిన అవసరం రాలేదు- స్వతహాగా మంచివాడైన లింగయ్య ఒకే దెబ్బకు కుదురుకున్నాడు.



ఇప్పుడు భార్యాభర్తలిద్దరూ రోజూ కూలికి పోతున్నారు. డబ్బుల్ని పొదుపు చేస్తున్నారు. మరుసటి సంవత్సరం వానలు పడ్డాయి. పంటలు బాగా పండాయి. లింగయ్య-సీతమ్మల కష్టాలు తీరాయి. పిల్లల నవ్వులతో కుటుంబం మళ్ళీ సజావుగా నడవసాగింది!

నవ్వు

వెంగళప్ప అడగ్గానే లిఫ్ట్ ఇచ్చాడు చిట్టిబాబు, మోటార్ సైకిల్ మీద కూర్చొని తన చేతిలోని కూరగాయల సంచీని తలమీద పెట్టుకొని మోయటం మొదలెట్టాడు వెంగళప్ప.

చిట్టిబాబు: అయ్యో తల మీద ఎందుకండి, సంచిని సీట్ మీద పెట్టుకోండి పర్లేదు!

వెంగళప్ప: నీ బైక్ నన్ను మోస్తోంది అది చాలు తమ్ముడూ, కూరగాయల సంచీని కూడా ఎందుకులే!

# అమ్మో! ఎండాకాలం

*రచన: అరుణ, హైదరాబాదు.*



బెజవాడలో కృష్ణ, అనూరాధ అనే దంపతులకు సాయి ఆదిత్య అనే ఒక కొడుకు ఉన్నాడు సాయి ఆదిత్య రెండో తరగతి చదువుతున్నాడు. బెజవాడలో నివాసం ఉండేవారు దానిని 'బ్లేజ్‌వాడ' అంటుంటారు సరదాగా- ఎందుకంటే అక్కడ ఎండలు చాలా ఎక్కువ కదా, అందుకని.

ఎండాకాలంలో స్కూలు ఏడున్నర నుంచి పన్నెండుర వరకు ఉంటుంది. ఒకరోజు సాయి ఆదిత్య ప్రొద్దున్నే స్కూలుకు వెళ్లిపోయాడు. తను, తన స్నేహితుడు అర్జున్ ఇద్దరూ వాటర్ బాటిల్స్‌తో ఆడుకుంటూ ఉంటే మంచి నీళ్లు అన్నీ క్రింద పడిపోయాయి. దాంతో సాయి ఆదిత్య ఆరోజు ప్రొద్దున్న మొత్తం నీళ్లు తాగకుండా ఉండిపోయాడు.





"స్కూలులో కుళాయి దగ్గర నీళ్లు తీసుకొని త్రాగచ్చు కదా?"- ఉహు. వాడికి ఆ సంగతి అంత బాగా తెలీదు. చిన్న పిల్లవాడు కదా. "ఇంటికి వెళ్ళిన తర్వాత త్రాగొచ్చులే" అని అలా ఉండిపోయాడు.

మరి అసలే మండే ఎండలు, మధ్యాహ్నం స్కూలు వదిలి ఇంటికి వచ్చేసరికి రెండు దాటింది. వాడి ఒంట్లో నీళ్ళన్నీ ఆవిరి ఐపోయినట్లున్నాయి- దాంతో వాడు చాలా 'డీ హైడ్రేట్' అయిపోయాడు- ఇంటి గుమ్మం దగ్గరే కళ్లు తిరిగి పడిపోయాడు!





అయితే వాళ్ళమ్మ చూసింది కదా, ఆవిడకు సంగతి అర్థమైంది. వెంటనే వాడిని ఇంట్లోకి తీసుకువెళ్లి, పడుకోబెట్టింది. గ్లాసెడు నీళ్ళలో చిటికెడు ఉప్పు, రెండు చెంచాలు చక్కెర వేసి కలిపి, అవి కరిగాక కొంచెం నిమ్మరసం పిండి తీసుకొచ్చి త్రాగించింది. ఆ తర్వాత వాడికి నిద్ర పట్టేసింది! అప్పుడు అమ్మే వాడి స్కూలు డ్రస్సు మార్చి, వదులైన కాటన్ డ్రస్ వేసింది. సాయంత్రం కృష్ణ ఆఫీసు నుండి వచ్చేటప్పుడు కొబ్బరి బోండాలు, పుచ్చకాయలు తీసుకువచ్చారు.

కొబ్బరి నీళ్ళు త్రాగి పుచ్చకాయలు తింటుండగా అనురాధ అడిగింది ఆదిత్యని- "ఎందుకు, అంత నీరసంగా అయిపోయావు? మంచి నీళ్లు సరిగా తాగలేదా?" అని.



"ఆడుకుంటుంటే నీళ్లు ఒలికిపోయాయి కదా, అందుకని 'ఇంటికి వెళ్లిన తర్వాత తాగుదాం' అని అట్లా ఉండిపోయాను" చెప్పాడు ఆదిత్య.

"ఏ పని చేసినా కాలాన్ని చూసుకొని చెయ్యాలి నాన్నా! ఎండాకాలం ఎక్కువ నీళ్ళు తాగాలి. వీలైతే ప్రతి ఇరవై నిముషాలకి కొంచెం మంచి నీళ్లు తాగాలి.

లేకపోతే వడదెబ్బ తగిలి, ప్రాణాలకు చాలా ప్రమాదం అయిపోతుంది. వానాకాలం అయితే వర్షంలో తడవకుండా గొడుగులు, రెయిన్ కోటులు వాడాలి. తడిగా, వాసనకొట్టే బట్టలు వేసుకోకూడదు. ఎండలో ఆరిన బట్టలే వేసుకోవాలి. వీలైతే గోరువెచ్చ నీళ్ళు త్రాగుతుండాలి. మరి చలికాలం అయితే ఒంటి నిండా బట్టలు వేసుకోవాలి. స్వెట్టర్లు వాడాలి. ఛాతీని, చెవుల్ని కప్పి ఉంచుకోవాలి" చెప్పింది అనురాధ.

"సరే, అయితే ఇప్పుడింక నేను ఎండ బాగా తగ్గిన తర్వాతే బయటికెళ్లి ఆడుకుంటాను. ఎక్కువ నీళ్లు కూడా తాగుతాను. వానాకాలం వచ్చాక గోరువెచ్చటి నీళ్ళు త్రాగుతాను" అన్నాడు, నోటినిండా పుచ్చకాయ ముక్కలు పెట్టుకొని.

నవ్వు!

**పిల్లలెవరు?**

పౌరుడు(ఫోన్లో): అయ్యా మునిసిపాలిటీ వారేనా?

మునిసిపాలిటీ వారు: అవును చెప్పండి

పౌరుడు: అయ్యా మా ఇంటి దగ్గర్లోనే ఓ కుక్క చచ్చిపడి ఉన్నది. కంపు వాసన భరించలేక పోతున్నాం దయచేసి దానిని ఇక్కడి నుండి తొలగించండయ్యా!

మునిసిపాలిటీ వారు: మాకు రావడం కుదరదు. మీరే దాన్ని ఎక్కడన్నా పూడ్చి పెట్టండి.

పౌరుడు (కోపంగా): కాదయ్యా ! మీరే రావాలి. తండ్రికి పిల్లల కడసారి చూపు దక్కకపోతే ఎలా?

క్రాంతి: ఇదిగో...మీ అబ్బాయిని కాస్త అదుపులో పెట్టుకో, మా ఇంట్లో ఉన్న టి.వి కి రాయి విసిరాడు.

ముఖేష్: రాయి టి.వి కి తగిలిందా?

క్రాంతి: లేదు. కొంచెంలో తప్పిపోయింది.

ముఖేష్: అలాగయితే.. అది మా కుర్రాడు విసిరింది కాదు.. మా వాడి గురి మీద నాకు నమ్మకం ఉంది.

భర్త: ఇంతకు ముందు టి.విలో చెబుతున్నారు.. బట్టతల ఉంటే ఏదైనా సాదించవచ్చు అని!

భార్య: ఖర్మ- ఆయన 'బట్టతల' అని అనలేదు- 'పట్టుదల' అన్నాడు!



# మారిన కిట్టు

*రచన: అఖిల్ కుమార్, భవానిపురం, విజయవాడ.*

అనగనగా ఓ అల్లరి పిల్లవాడు ఉండేవాడు. వాడి పేరు కిట్టు. అమ్మా నాన్నలకు ఏకైక సంతానం వాడు. అందుకని వాడిని చాలా గారాబంగా పెంచారు. దాంతో వాడికి అల్లరే అలవాటైపోయింది.

ఒకరోజున వాడు ఇంటి బయట వసారాలో ఆడుకుంటూ పక్కింటి వైపుకు చూసాడు. పక్కింటి వాళ్ల తలుపు వేసి ఉన్నది. వాడు వెళ్ళి వాళ్ళ తలుపు దబదబా తట్టి ఏమీ తెలీనట్టుగా వెనక్కి వచ్చి కూర్చున్నాడు.

రెండు క్షణాల తర్వాత పక్కింటి ఆంటీ తలుపు తీసి బయటికి తొంగి చూసింది. ఎవరూ లేరు! ఆవిడ బయటికొచ్చి, 'ఎవరది?' అని అరిచి మళ్ళీ లోనికి వెళ్ళి తలుపు వేసుకున్నది.

ఆవిడ తలుపు వేసుకోగానే కిట్టు మళ్ళీ వెళ్ళి

తలుపు తట్టి వచ్చాడు. ఇట్లా రెండు మూడుసార్లు అయ్యేసరికి, ఆవిడకు విసుగొచ్చింది. దొంగల్ని పట్టుకుందామని ఈసారి ఆవిడ తలుపు వెనకనే నిలబడ్డది.

అతి తెలివి కొద్దీ నాలుగోసారి తలుపు తట్టిన కిట్టు, చటుక్కున ఆమె చేతికి చిక్కాడు. ఆవిడ వాడిని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టింది.

అయితే దానినుంచి వీడికి బుద్ధి రాలేదు- కోపం వచ్చింది-

ఆ ఆంటీకి కుక్కలన్నా, పిల్లులన్నా చచ్చేంత భయం. ఇది అలుసుగా తీసుకున్నాడు కిట్టు. వాడికి కుక్కలంటే భయం లేదు; పిల్లులంటే భయం లేదు! అందుకని వాడు పోయి వీధిలోంచి రెండు కుక్కల్ని, పిల్లుల్ని వేరువేరుగా పట్టుకొచ్చాడు.

ప్రక్కింటి తలుపు తట్టి, ఆవిడ తలుపు తీయగానే నాలుగింటినీ వాళ్ల ఇంట్లోకి వదిలి, గట్టిగా తలుపులు వేసేసి బయటినుండి గొళ్ళెం పెట్టాడు!

పిల్లులు రెండూ ఇంట్లో చెరో మూలకు పరుగెత్తాయి. రెండు కుక్కలూ వాటి వెంట పడ్డాయి. పిల్లులు రెండూ బుస్సు బుస్సుమన్నాయి. కుక్కలు పళ్ళు చూపిస్తూ గురగురమన్నాయి. ఆంటీ వణికి పోతూ ఒక మూలన నక్కింది.

నాలుగు జంతువుల మధ్యనా ఇంట్లో సామాను బలి అయ్యింది. పిల్లులు, కుక్కలు ఇంట్లో ఉన్న సీసాల్ని, కప్పుల్ని, సాసర్లనీ పగలగొట్టాయి. ఇల్లంతా చిందరవందర చేశాయి. బయటకు పోలేక, లోపల ఊరికే కూర్చొని ఉండలేక ఇల్లు పీకి పందిరేసాయి.

బయట నిలబడి నవ్వుకున్న కిట్టు తీరుబడిగా గొళ్ళెం తీశాడు. మరుక్షణం పిల్లులు, కుక్కలు బయటికి దూకాయి. వాళ్ళ వెనకనే బయటికి వచ్చింది ఆంటీ. ఆంటీ ముఖంలోని ఆందోళన చూసి ముసి ముసి నవ్వులతో వెళ్లిపోబోయాడు కిట్టు-

అయితే ఆ వెంటనే వాడికి అర్థం కానిదొకటి జరిగింది: అప్పటివరకూ మామూలుగా ఉన్న ఆంటీ అకస్మాత్తుగా పులి మాదిరి ఐపోయింది- వాడిని పట్టుకొని బరబరా ఇంట్లోకి ఈడ్చుకెళ్ళింది. వాడు తలెత్తి చూసేలోగా వాడి ఒంటిమీద దెబ్బలు

పడ్డాయి. 'ఒకటి-రెండు-మూడు' వరకూ లెక్కపెట్ట గలిగాడు వాడు. వాడికి వచ్చింది అంతవరకే మరి! అయితే ఆ తర్వాత కూడా ఇంకా దెబ్బలు పడుతూనే పోయాయి. వాడి నోరు దానంతటఅదే మొత్తుకోవటం మొదలెట్టింది. చేతుల మీద వాతలు పడ్డాయి. చెవులు కమిలి పోయాయి. ఆంటీ చేతులోకి వచ్చిన ఓ త్రాడు వాడిని ఒక కుర్చీకి కట్టేసింది.



వాడికి ఇంకా ఏమీ అర్థం కాకనే, ఆవిడ కిట్టు వాళ్ళింటికి పోయింది. ఏం చెప్పిందో ఏమో, ఐదు నిముషాల్లో ఆవిడతోబాటు కిట్టు వాళ్ళ అమ్మ ప్రత్యక్షం అయ్యింది. చుట్టూ పగిలిన సామాన్లకేసి బిక్కుబిక్కుగా చూసింది. మరుక్షణం కిట్టు కట్లు విప్పబడ్డాయి. వాడు గర్వంగా వాళ్లమ్మకేసి తిరిగాడు. అంతే- వాళ్లమ్మ వాడిని పట్టుకుని ఈడ్చింది. ముఖాన్ని వికారంగా పెట్టింది. వీపు విమానం మోత మ్రోగించింది.

ఆ రోజు సాయంత్రం కిట్టు వాళ్ల నాన్న ఆఫీసునుండి రాగానే ముగ్గురూ బజారుకు పోయారు. అట్లా బజారుకు పోవటం అంటే కిట్టూకి చాలా ఇష్టం. వాడికి చాలా ఆనందంగా ఉంది.

వాళ్ల నాన్న తన నెలజీతం అంతా తీసి చూపించాడు కిట్టూకి. అన్ని డబ్బుల్ని చూసి కిట్టూ సంతోషంగా నవ్వాడు. ఎన్నడూ లేనిది, ఆరోజున వాళ్లమ్మ ఎక్కడా లేనన్ని గిన్నెలూ, కప్పులూ, సాసర్లూ కొన్నది. నాన్న నెలజీతం అంతా ఖర్చయిందా రోజున!

కిట్టూ ముఖం వెలిగిపోతున్నది, తాము కొన్న సామాన్లన్నీ తలచుకొని. ఇల్లు చేరుకోంగానే నాన్న ప్రక్కింటి ఆంటీ వాళ్ళ తలుపు తట్టాడు. కిట్టూ చేత ఆ సామాన్లన్నీ ఆవిడకు ఇప్పించాడు!

ఇప్పుడు కిట్టూ ముఖం అదోలా అయ్యింది. "మమ్మల్ని క్షమించండి- వీడు ఇంకెప్పుడూ

ఇలాంటి పని చేయడు- ఇంకొక్కసారి ఏమైనా అల్లరి పని చేసాడంటే వీడి కిట్టీ బ్యాంకులో ఉన్న డబ్బులన్నీ మీకు ఇచ్చేస్తాడు. మీరు మా యింట్లోకి పిల్లుల్నీ, కుక్కల్నీ వదిలినా ఏమీ అనడు. ఆ కుక్కలు పిల్లులు వాడి సామాన్లు ఏం ఎత్తుకెళ్ళినా ఉలకడు-పలకడు- మళ్ళీ కావాలని అడగడు" చెప్పాడు నాన్న.

కిట్టు బిత్తరపోయాడు.

తర్వాతి రోజు ఉదయాన్నే వాడికి 'కుర్కురే' ఆకలైంది. నాన్న చెప్పాడు- "చూడు బాబూ! నా దగ్గరున్న డబ్బులన్నీ పెట్టి ఆంటీకి గిన్నెలు కొనిచ్చాం కదా, ఈ నెలంతా మనకు కుర్కురేలు ఉండవు, నూడుల్సూ ఉండవు, పుస్తకాలు, పెన్నులు, డ్రస్సులు, షూస్- ఏమీ ఉండవన్నమాట. అర్థమైందిగా?!" అని. అమ్మ కూడా అవునన్నట్లు తలాడించింది బాధగా.

ఆ తర్వాత ఇంకెప్పుడూ కిట్టుగాడు ప్రక్కింటివాళ్లతో పెట్టుకోలేదు.

***

మళ్ళీ ఇంకోసారి తోక జాడించాడు కిట్టూ. ఈసారి వాళ్ల అమ్మా-నాన్నా లేని సమయం చూసుకున్నాడు. మెల్లగా పోయి సందులో ఉన్న ఇళ్ళన్నిటికీ బయటినుండి గడియలు పెట్టి వచ్చాడు.

అయితే నాలుగిళ్ళ అవతల ఉండే రంగాచారి మాస్టారు వాడి ఈ తుంటరి పనిని చూడనే చూసారు. రంగాచారి మాస్టారి ఇంటికి వెనకవైపున మరో తలుపు ఉంది. ఆయన మెల్లగా ఆ తలుపు తీసుకొని బయటికొచ్చారు. చప్పుడు కాకుండా కిట్టూ వాళ్ళింటికి వచ్చి, వాడు లోపల ఉండగానే బయటివైపునుండి గొళ్ళెంవేసి, తాళం పెట్టి మరీ వెళ్ళారు. వెళ్తూ వెళ్తూ మిగిలిన ఇళ్ళకు కిట్టూ వేసిన గడియలన్నీ తీసేయటమే కాదు- వాళ్లందరికీ కిట్టు గురించి చెప్పి మరీ వెళ్ళారు.

ఆరోజున కిట్టూకి ఆకలైనా తలుపు రాలేదు; ఆడుకోడానికి పోదామన్నా తలుపు రాలేదు!

సాయంత్రం అవుతుండగా రంగాచారి మాస్టారుతోబాటు సందులోవాళ్లంతా వచ్చారు. "మర్యాదగా సారీ చెప్పు- లేకపోతే ఇవాళ్లంతా ఇంతే!" అన్నారు. అంతలో

అమ్మా-నాన్న కూడా వచ్చారు. "ఏమైంది?!" అని అడిగి కనుక్కున్నారు. దాంతో కిట్టుగాడి తోక మరింత సర్దుకున్నది.

***



"స్కూలుకు లేటైపోతోంది-తొందరగా రెడీ అవ్వు" అంటోంది కిట్టు వాళ్ళ అమ్మ. తర్వాతి రోజు నుండి దసరా సెలవులు కావటంతో మారు మాట్లాడకుండా రెడీ అయి స్కూలుకి వెళ్లాడు కిట్టు. మాస్టారు గారు వచ్చారు- క్లాసు ప్రారంభమయింది:

"ఒరేయ్ కిట్టూ! లేచి నిలబడు- నేను అడిగే ప్రశ్నలకి సరిగ్గా సమాధానాలు ఇవ్వు- రామాయణంలో సీతను ఎవరు ఎత్తుకెళ్ళారు?" అడిగారు టీచర్.

"సురేష్ అయి ఉంటాడు సర్! మీరు నిన్న వదిలేసిన చాక్‌పీసు ముక్కని వాడే ఎత్తుకెళ్లాడు" చెప్పేసాడు కిట్టు.

టీచర్‌కి కోపం వచ్చింది. "ఇదిగో, జోకులు వద్దు చెబుతున్నాను. సీతను ఎవరెత్తుకెళ్ళారో చెప్పు మర్యాదగా" అన్నారు.

"సార్! నాకు ఏ పాపం తెలియదు. నన్ను వదిలేయండి సార్. అలాంటి కిడ్నాపుల గురించి నాకు ఏమాత్రం తెలియదు" కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు కిట్టు.

దాంతో "నేను అడిగేదేంటి నువ్వు చెప్పేదేంటి?!" అని మాస్టారే బిత్తర పోయారు. ఇతిహాసాల ప్రశ్నలు చాలించి లెక్కల్లోకి వచ్చారు-

"నిన్న నేను టేబుల్స్ నేర్చుకొని రమ్మన్నాను- నేర్చుకొచ్చావా?!" అన్నారు.

"నేర్చుకున్నాను సార్!" అన్నాడు కిట్టు.

"ఎన్ని నేర్చుకున్నావు?" అనుమానంగా అడిగారు టీచరు గారు.

"ఫైవ్ టేబుల్స్ నేర్చుకున్నాను సార్!"

చెప్పాడు కిట్టు, చేతులు కట్టుకొని ఊగుతూ- "డైనింగ్ టేబుల్, డ్రాయింగ్ టేబుల్, వాషింగ్ టేబుల్, చిన్న టేబుల్, పెద్ద టేబుల్" అని.

మాస్టారికి బలే కోపం వచ్చింది. అయినా తమాయించుకున్నారు. కిట్టుని మటుకు బాగా తిట్టారు.

దాంతో కిట్టులో ఉన్న రాక్షసుడు మళ్ళీ ఓసారి తలెత్తాడు- తను చూసిన తెలుగు సినిమాలన్నీ గుర్తు చేసుకున్నాడు. ఏ హీరో ఎలాంటి పనులు చేసాడో గుర్తు చేసుకొని పరవశించి పోయాడు.

మాస్టారు రోజూ బడికి ఓ పాత స్కూటర్ మీద వస్తారు. ఆ స్కూటరుకు హ్యాండిల్ లాక్ పడదు; పడితే అంత సులభంగా రాదు. అందుకని మాస్టారు దానికి తాళం వెయ్యకుండానే బడి ఆవరణలో పెడుతుంటారు.

కిట్టుకు అది గుర్తొచ్చింది. ఆ బైకుని నెట్టుకెళ్ళి రోడ్డు మధ్యలో పెట్టి, తాళం వేసి ఎంచక్కా నవ్వుకుంటూ పోయాడు. త్వరలోనే ట్రాఫిక్ జామ్ అయింది. ట్రాఫిక్ పోలీసులు వచ్చారు. "ఈ బండి ఎవరిది? ఇక్కడెవరు పెట్టారు?" అని బడి వాచ్‌మాన్‌ను అడిగారు.

"ఇది మాస్టారిది సార్! దీన్ని కిట్టు అనే పిల్లాడు నెట్టుకొచ్చి ఇక్కడ పెట్టాడు సార్!" అని అతను వాళ్లకు చెప్పేసాడు.



దాంతో పోలీసులు నేరుగా కిట్టు తరగతికే వచ్చేసారు. కిట్టూని రమ్మని వాళ్లతోబాటు స్టేషనుకు తీసుకెళ్ళారు.

కొంచెం సేపటికి టీచర్లంతా వచ్చారు; కిట్టూవాళ్ల అమ్మ-నాన్న ఇద్దరూ వచ్చారు

స్టేషనుకు. పోలీసులు లాఠీలు చూపించి బెదిరించారు. అమ్మ ఏడ్చి తిట్టింది. మాస్టార్లంతా నవ్వారు. నాన్న జేబులో ఉన్న డబ్బులన్నీ పోలీసువాళ్లకు ఇచ్చేసి, కిట్టూని వెంట పిలుచుకుపోయాడు.

"నీకేమైంది కిట్టూ?! ఎందుకిట్లాగ?! కచ్చగా ఉండద్దురా! నువ్వు వేరే వాళ్లకు ఏది చేస్తావో అదే నీకు జరిగితే ఎలా ఉంటుందో ఊహించుకో, ప్రతిసారీ- కొంచె పెద్దవ్వురా త్వరగా!" అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

"లేదులేమ్మా! ఏడవకు!నేను ఇకమీద సరిగా ఉంటానుగా! కచ్చ పనులు అస్సలు చెయ్యను" మాట ఇచ్చాడు కిట్టూ.

***

దసరా సెలవులు వచ్చేసాయి. కిట్టు కచ్చ పనులు మానేసాడు గానీ, ఇంకా అల్లరి పనులేవీ తగ్గించలేదు.

అమ్మకు ఓ ఐడియా వచ్చింది- "వీడికి ఏదైనా జంతువును తెచ్చిద్దాం. దాన్ని జాగ్రత్తగా పెంచమందాం. వాడికి బాధ్యత అలవడుతుంది" అని. దాంతో "ఒరే కిట్టూ! వెళ్లి ఒక మంచి కోడిపిల్లను తీసుకురారా!" అని కిట్టు చేతిలో ఐదు రూపాయలు పెట్టింది.

కిట్టుగాడు కోడిపిల్లను కొనుక్కొచ్చాడు. దానితో ఇష్టం వచ్చినట్లు ఆడుకున్నాడు. అది పరుగెత్తింది. దాన్ని తరిమి, చివరికి అలిసిపోయాక అందుకొని, దాన్ని కాస్తా తన జేబులో పెట్టుకొని జిప్పు వేసేశాడు. కోడిపిల్లకు ఊపిరి ఆడలేదు. చిట్టి పిల్ల కదా, పాపం అది కాస్తా చచ్చిపోయింది!

అమ్మకి కోపం వచ్చింది. అయినా బయట పడలేదు. "జంతువులను అట్లా జేబులో పెట్టుకుంటారా, ఎవరన్నా?! జేబులో పెట్టుకోకూడదు- వాటిని ఎత్తుకోవాలిరా కన్నా" అని చెప్పింది ముద్దుగా.

అంతలో వాళ్ల ఇంటి ముందు నుండి ఒక ఆవు దూడ పోతూ కనిపించింది కిట్టూకి. అమ్మ అటు తిరగ్గానే వాడు పోయి, దాన్ని పట్టుకొని తమ వసారాలోకి తెచ్చాడు. ఉన్నవాడు ఉన్నట్లు దాన్ని ఎత్తుకోవాలని చూశాడు.

కిట్టూ చిన్న పిల్లాడే గదా! అంత బరువును ఎట్లా మోస్తాడు? ఎత్తుకున్న ఆ దూడను కింద పడింది- దాని కాలు కాస్తా విరిగింది!

అంతలో అక్కడికి చేరుకున్న దూడ యజమాని నానా యాగీ చేసి, అమ్మ ముక్కుపిండి డబ్బులు వసూలు చేసాడు.



వాళ్ళంతా వెళ్ళిపోయాక, అమ్మ చెప్పింది మురిపెంగా- "ఇట్లా బరువుగా ఉండేవాటిని ఎత్తుకోకూడదు నాన్నా! తోలుకుంటూ ఇంట్లోకి తెచ్చుకోవాలి" అని.

"ఎట్లా తోలతాం అమ్మా?" అడిగాడు కిట్టూ.

"కొరడాతో తోలాలిరా కన్నా!" అన్నది అమ్మ వాడికి తెలియజెబుతున్నట్లు.

సరిగ్గా అదేరోజున కిట్టు వాళ్ల ఇంటికి చుట్టాలు వస్తున్నారు. "కిట్టూ! చుట్టాలు వస్తున్నారు బాబూ, అట్లా బస్టాండు దాకా వెళ్ళి వాళ్లను ఇంటికి పిల్చుకురా" అన్నది అమ్మ.

అవకాశం కోసమే ఎదురు చూస్తున్న కిట్టూ కొరడా తీసుకొని పోయి, వాళ్లను కొట్టుకుంటూ ఇంటిదాకా తీసుకువచ్చాడు. ఆ వచ్చినవాళ్లు మంచివాళ్ళు కాబట్టి "బలే పెంచుతున్నారమ్మా, మీ కిట్టుని!" అని, వచ్చినంత త్వరగానూ సెలవు పుచ్చుకున్నారు.

వాళ్ళు వెళ్ళాక అమ్మ కిట్టును కూర్చోబెట్టుకొని, "చూడు నాన్నా! ఇట్లా చేస్తారా, తప్పుకదూ?! మన ఇంటికి అతిథులు ఎవరైనా వస్తే వాళ్ళకు స్వాగతం పలకాలి. మర్యాదలు చెయ్యాలి. ఊరికే కొట్టకూడదమ్మా" అని మంచి మాటలు చెప్పింది.

ఆ రోజు సాయంత్రం చీకటి పడుతుండగా ఎవరో ఇంటికి వచ్చారు- కిట్టు ఒక్కడే ఉన్నాడు ఇంట్లో. "ఏం బాబూ?! అమ్మని పిలువమ్మా" అన్నాడు వచ్చినతను. "అమ్మ బజారుకెళ్ళింది" చెప్పాడు కిట్టు. "మరి నాన్న ఉన్నాడా?" అడిగాడు అతను. "లేదు.

నాన్న కూడా అమ్మతోబాటే వెళ్ళాడు. ఎనిమిది గంటలకు గానీ రారు ఇద్దరూ" అని చెప్పి, "ఇంతకీ మీరెవరు?" అడిగాడు కిట్టు.



అతను కొంచెం దిక్కులు చూశాడు.

అంతలో కిట్టుకి అమ్మ మాటలు గుర్తుకొచ్చాయి- అతిథి! "ఇతనే అతిథి" అని వెంటనే ఆ వచ్చిన వాడికి స్వాగతం పలికాడు. కూర్చోబెట్టాడు; మర్యాదలు చేశాడు.

అయితే ఆ వచ్చినవాడు ఒక దొంగ- వాడు కిట్టు సేవలన్నిటినీ స్వీకరించి, ఆ తర్వాత చేతికందిన నగలు డబ్బు తీసుకొని చక్కా పోయాడు. ఆ రోజున అమ్మ ఒక్కతే వచ్చింది ముందుగా. తన నగలు నట్రా పోవటం చూసి ఆవిడ లబోదిబో మన్నది.

అయినా వాడికి ఇంకో అవకాశం ఇస్తూ- "కిట్టూ! జాగ్రత్తగా ఉండాలి. ఇంటికొచ్చిన వాళ్లంతా అతిథులు కారు. ఎవరైనా అనూహ్యంగా రాత్రి పూట చీకట్లో మన ఇంటికి వచ్చారనుకో, వాళ్ళు అతిథులు కాకపోవచ్చు. అలాంటప్పుడు ఈ తాడుతో వాళ్ళని కుర్చీకి కట్టేసి, కర్రతో బలంగా వాయించేయ్యాలి. అందరూ మనవాళ్ళే ఎలా అవుతారు?" అన్నది.

ఆరోజు రాత్రి ఆలస్యంగా వచ్చిన నాన్నను కుర్చీకి కట్టేసి కొట్టాడు కిట్టు.

అమ్మ ఇక మాట్లాడలేదు. కిట్టుకు ఏం చెప్పినా ప్రమాదమే అని గ్రహించినట్లుంది!

అయితే సంవత్సరం గడిచేసరికి కిట్టుకి తెలివి పెరిగింది. ఏది మంచి ఏది చెడు గ్రహింపుకు వచ్చింది. రాను రాను కచ్చులాగానే వాడి అల్లరి కూడా తగ్గిపోయింది! 



# ముక్కు తిమ్మన తలనొప్పి

తెలుగు జానపద కథ

*'మాటలాడ గల్గు మర్మము లెరిగిన- పిన్న పెద్దతనము లెన్నవలదు - పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుగదా' అంటాడు వేమన. చిన్నవాళ్లనీ, పెద్దవాళ్లననీ ఏమున్నది; పాండిత్యమే ప్రధానం. చిన్నవాడి చేతిలో ఉన్నా సరే, వెలిగే ప్రతి దీపమూ వెలుగునిస్తుంటుంది- కదూ?*

*సేకరణ, కథనం : సుగుణ రూపనగుడి, ముఖపుస్తకం*

అష్టదిగ్గజాలలో ఒకడైన నంది తిమ్మన కవికి ఒకసారి విపరీతమైన తలనొప్పి పట్టుకున్నది.

రాయలవారు ఆయనను ఎంతో మంది వైద్యులకు చూపించారు; ఎన్నో మందులు వాడించారు. అయినా ఏమంత ప్రయోజనం లేదు. ఏ మందులు వాడినా కొద్దిపాటి ఉపశమనం; మళ్ళీ కొన్నాళ్ళకు రెట్టింపు తలనొప్పి!

'ఇలా కాదు- కాశీలో గొప్ప వైద్యులున్నారు. అక్కడికి వెళ్లి చూపించుకుంటాను' అని పరివారంతో సహా కాశీకి ప్రయాణం కట్టారు తిమ్మనగారు.

అలా వెళ్తూ వెళ్తూండగా మధ్యలో తలనొప్పి చాలా ఎక్కువైపోయింది. ఆ సరికి వాళ్ళు

నెల్లూరు దగ్గర దర్శి మండలంలో ఉన్నారు. ఆ దగ్గర్లోనే 'బోదనం పాడు' అనే ఊరున్నది. వీళ్ళంతా ఆ ఊరి శివార్లలోనే డేరాలు వేసుకొని బస చేశారు.



తిమ్మన గారు తలనొప్పికి తట్టుకోలేక-పోతున్నారు. పెద్దగా అరుపులు, మూలుగులు. తిమ్మనతో పాటు వచ్చిన రాజవైద్యుడు ఏవేవో మూలికలు నూరుతూనే ఉన్నాడింకా. ఆయన పరివారానికి ఏం చేయాలో అర్థం కాని పరిస్థితి. అంతా గందరగోళ పడుతున్నారు.

సరిగ్గా ఆ సమయానికి అటుగా వచ్చారు, ఇద్దరు వైద్య సోదరులు. వాళ్ళిద్దరూ ఇంకా చిన్నవాళ్ళే. తండ్రి తాతలనుండి వచ్చిన వైద్యాన్ని కొనసాగించుకుంటూ బోదనం-పాడులో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. వాళ్లకు వినిపించాయి ఈ అరుపులు.

వాళ్ళు ఆ డేరాల దగ్గరకు పోయి కాపలాగా వున్న సైనికులతో "అయ్యా! మేము ఈ ప్రాంతపు ఘన వైద్యులము. ఇక్కడ ఎవరో బాధతో మూలుగుతున్నారు. మేము లోపలి వెళ్లి చూస్తాము" అన్నారు.

ఒక కాపలావాడు వాళ్ళని అక్కడే ఉండమని చెప్పి లోపలికి వెళ్లి దండనాయకుల వారితో "ఎవరో వైద్యులట, వచ్చారు- లోపలికి పంపమంటారా?" అని అడిగారు.

ఆ సరికే ఏం చేయాలో తెలీక తల పట్టుకొని కూర్చున్న దండనాయకుడు "సరే ప్రవేశ పెట్టు" అన్నాడు. ఇద్దరినీ లోపలి తీసుకొని వచ్చారు సైనికులు.

దండనాయకుడు వాళ్ళను కూర్చోబెట్టి "మీరెవరు? మీ పరిచయం?" అన్నాడు.

"అయ్యా! మేం యిద్దరం అన్నదమ్ములం. ఈ బోదనంపాడు గ్రామానికి చెందిన

వాళ్ళం. మా పేర్లు పుల్లాపంతుల పుల్లన్న, సూరన్న. యిక్కడెవరో జబ్బు పడినట్టున్నారు- మూలుగులు బయటికి వినిపిస్తున్నాయి. మేం వారికి వైద్యం చేస్తాం" అన్నారు.

"ఆయన విజయనగర సామ్రాజ్యాధీశులు శ్రీ శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థాన అరణపు కవులు శ్రీ నంది తిమ్మనార్యుల వారు" చెప్పాడు దండనాయకుడు.

"ఏమీ! పారిజాతాపహరణ కర్త అయిన నంది తిమ్మనగారా?! ఏమైంది? వారికొచ్చిన జబ్బు ఏమిటి?!" అడిగారు వాళ్ళు. ముక్కు తిమ్మనగారు రచించిన 'పారిజాతాపహరణ కావ్యం' గురించి తెలీని పండితులే లేరు మరి, ఆ రోజుల్లో.

"లోపలికి రండి" అని పిలుచుకొని వెళ్ళాడు దండనాయకుడు.

తిమ్మనగారు అక్కడ పడక మీద పడుకొని దొర్లుతూ పెద్దగా అరుస్తున్నారు. పక్కన రాజవైద్యుడు కల్వంలో మందు నూరుతున్నాడు. లోపలికి వచ్చిన వాళ్ళని చూసి 'ఎవరు మీరు?' అని గద్దించాడు రాజ వైద్యుడు.

దండనాయకుడు వారి వివరాలు చెప్పగానే వైద్యుడు ముఖం చిట్లించాడు. "మహా మహా వైద్యులే ఏమీ చెయ్యలేక పోయారు. పిల్లలు- మీరేమి చేస్తారు? నాయనలారా, మీకు తెలుసో లేదో, వీరు నంది తిమ్మన గారు. వీరి తలనొప్పిని ఎలాగైనా తగ్గించాలని స్వయంగా రాయలవారే పూనుకొని, గొప్పగొప్ప వైద్యులకు చాలా మందికి చూపించి, 'ఇంక కుదరదు' అని ఆశ వదులుకున్నారు. ఈ మారుమూల గ్రామంలో చిన్న చిన్న వైద్యాలు చేస్తూ బ్రతుక్కునే మీ వల్ల తీరే సమస్య కాదు నాయనా ఇది!" అన్నాడు పెదవి విరుస్తూ.

"ఇలాంటి శిరోవేదనకు మంచి వైద్య ప్రక్రియ ఉంది మా దగ్గర- మాకు ఒక్క అవకాశం యిచ్చి చూడండి. మా అన్నగారు నాడీ పరీక్షలో ఘనులు" అన్నాడు సూరన్న, అన్నను ముందుకు నెడుతూ.

ఇంతలో "ఏమిటి, ఈ అల్లరి? నన్ను అసలు విశ్రాంతి తీసుకోనిచ్చేట్లు లేరే?!" అంటూ కోపంగా పాన్పు మీదినుండి దిగి వచ్చారు

తిమ్మన గారు.

వైద్య సోదరులు ఇద్దరూ లేచి నిలబడి ఆయనకు నమస్కరించారు. "కవివర్యా! మేం ఈ గ్రామ వైద్యులం. మిమ్మల్ని దర్శించి మీ ఆరోగ్యం గురించి పరామర్శించి వెళ్ళడం మా ధర్మం కదా! అందుకే వచ్చాం" అన్నారు.

"సరే, కూర్చోండి" అని సైగ చేస్తూ చెప్పారు తిమ్మనగారు- "నాకు ఈ తలనొప్పి బాధ చాలా ఏళ్ళుగా వుంది. ఈ మధ్య మరీ ఎక్కువయింది. తలలో ఏదో తొలుస్తున్నట్టు బాధ. ఒక్కోసారి తలని గోడకు గుద్ది బద్దలు కొట్టుకోవాలనిపిస్తుంది" అన్నారు తిమ్మన-గారు, తలను నొక్కుకుంటూ.

"తమరి సెలవైతే మేము ఓసారి మిమ్మల్ని పరీక్షిస్తాం. మాకున్న పరిజ్ఞానంతో, మా పూర్వీకుల ఆశీస్సులతో మీకు మంచి వైద్యం అందించగలమని మా నమ్మకం" అన్నాడు పుల్లన్న.

"ఏమి చేస్తారో?! నాకైతే ఈ వైద్యం మీద నమ్మకం పోయింది. రాయలవారు నాకోసం చెయ్యని ప్రయత్నం లేదు. ఎందుకు వచ్చిందో ఏమో గానీ నా ప్రాణాలు తోడేస్తోంది, ఈ మహమ్మారి. ఇట్లా బాధ పడుతూ ఉండటం కంటే 'చావే మేలు' అనిపించింది. అందుకే ఇట్లా కాశీ ప్రయాణం పెట్టుకున్నాను. అయితే భగవంతుడి కరుణ ఇలా ఉంది- మధ్యలోనే శిరోవేదన ఎక్కువై ఇలా యిక్కడ బస చెయ్యాల్సి వచ్చింది" అన్నాడు తిమ్మన.

"అయ్యా! అర్థమైంది. మీ బాధ నిజంగానే వర్ణనాతీతం. ఏనుగు కుంభస్థలంలోకి పాము ప్రవేశించినప్పుడు అది ఎంతగా విలవిలలాడి పోతుందో, ఎన్నెన్ని కొండల్ని ఢీకొంటుందో మీరు వర్ణించి ఉన్నారు గతంలో. మీ ఈ శిరోవేదన అంతకు వెయ్యి రెట్లు వుంటుంది. భరించడం ఎవరికైనా కష్టమే. ఒకసారి చెయ్యి యివ్వండి- నాడి పరీక్షిస్తాం" అంటూ తిమ్మనగారి చేతిని అందుకొని శ్రద్ధగా నాడిని పరీక్షించాడు సూరన్న.

అటుపైన "అవునవును. అర్థమైంది" అంటూ పుల్లన్నకు ఏదో వివరించాడు వైద్య పరిభాషలో. పుల్లన్న చిరునవ్వు నవ్వి, తిమ్మనగారి వైపు తిరిగి "అయ్యా! ఏమీ

పరవాలేదు. మీ సమస్య తీరిపోతుంది. మీకు ఇక్కడే శాంతి లభించనున్నది. భయంలేదు" అన్నాడు.

అతని నవ్వును చూడగానే తిమ్మన్నగారికి కోపం వచ్చేసింది. "విషయాన్ని మీరు యింత తేలికగా తీసుకోవడం విడ్డూరంగా ఉంది. ఎందరో గొప్ప గొప్ప వైద్యులు ప్రయత్నించి, 'మా చేత కాద'ని చేతులెత్తారు. అల్లాంటిది మీరు విముక్తి కలిగించడమా? మీ వైద్యమూ వద్దు, మీ మందూ వద్దు, మీ పథ్యాలూ వద్దు! మీకో నమస్కారం! యిలాగే కాశీ దాకా వెళ్ళ నివ్వండి. తర్వాత ఆ కాశీనాథుడే చూసుకుంటాడు" అన్నారు మూలుగుతూ.

"అయ్యా మా మాట నమ్మండి. మావి వ్యర్థపు మాటలు కావు. ఈ రోగానికి మందులూ, మాకులూ, పథ్యాలు ఏమీ లేవు. దీనికి జరగాల్సిన వైద్య ప్రక్రియ వేరే ఉన్నది. ఒక్క రోజులోనే నయమైపోతుంది. ఓపిక పట్టాలి- అంతే" అన్నాడు పుల్లన్న ధీమాగా.

"ఔనౌను- ఓపిక పట్టాల్సిందే! మందూ-మాకూ-పథ్యమూ లేని వైద్యం కదా!! లోకంలో ఎక్కడా లేని వైద్యాన్ని చెప్తున్నారు" అంటూ శిరోభారంతో కూలబడి తల పట్టుకున్నారు తిమ్మన గారు.

"అయ్యా! మీ మూలుగు వినగానే మీ సమస్య ఏమిటో, అది ఎలా తగ్గుతుందో మాకు అర్థమై పోయింది. మీరు మాకు ఒక్క అవకాశం యిచ్చి చూడండి- తప్పులేదు కదా!" అన్నారు వైద్య సోదరులు బ్రతి మాలుతూ.

దాంతో తిమ్మన రాజ వైద్యుడి వైపు చూస్తూ "ఆర్యా! ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? వీరికి ఒక అవకాశం యిచ్చి చూద్దామా?" అన్నాడు.

"కవి వర్యా! యిదంతా పనికిరాని వ్యవహారమే. ఎంతో మంది గొప్ప గొప్ప వైద్యులకు లొంగని జబ్బు ఈ మారు మూల పల్లెల్లో కప్పల్లాగా నివసించే వారికి సాధ్యం కాదు. మనం కాలాన్ని వ్యర్థం చేయకుండా త్వరగా కాశీనగరం చేరుకుంటే మంచిది" అన్నాడు రాజవైద్యుడు.

తిమ్మన కొంచెం సేపు ఆలోచించి, నిట్టూర్పు

విడుస్తూ "నేను ఇప్పుడు మళ్ళీ వెంటనే ప్రయాణం ఆరంభించే స్థితిలో లేను. ఊరికే ఇక్కడ ఆగినా, వీరు చెప్పే ఉపచారం ఏదో అది చేసినా నావరకూ ఒకటే- వీరి మాటా విని చూద్దాంలెండి. తప్పులేదు" అన్నాడు.

"ఇదిగో అబ్బాయిలూ! మీ వైద్యానికి ఒప్పుకుంటున్నాం. అయితే ఒక షరతు. మీరు నయం చేయలేని పక్షంలో రాజ దండనకు గురికావల్సి వస్తుంది. తెలుసా?" గద్దించాడు రాజవైద్యుడు.

వాళ్ళు ఇద్దరూ జడుసుకోలేదు. "అయ్యా! ఇది మా వైద్యానికి పరీక్షా సమయం.. కానివ్వండి" అన్నారు.

"అబ్బో మంచి పట్టున్న వైద్యులే!" అంటూ ముక్కున వేలేసుకుని, నవ్వలేక, తలపట్టుకున్నారు తిమ్మనవారు.

ఆ రోజునుంచీ వరుసగా మూడు రోజుల పాటు వైద్య సోదరులు ఇద్దరూ తిమ్మన ముక్కులో చుక్కల పసరు పిండుతూ వచ్చారు. నాలుగోరోజు వైద్యానికి కావలిసిన పదార్థాలన్నీ ఒక జాబితాగా తయారు చేసి యిచ్చారు. చూస్తే అందులో విశేషంగా వైద్యానికి కావలిసిన వస్తువులేమీ లేవు: పుట్టెడు బియ్యం మాత్రం కావాలన్నారు.

"పుట్టెడు బియ్యమా? ఊరందరికీ సమారాధన చేస్తారా, ఏమి?!" అన్నాడు రాజవైద్యుడు వెటకారంగా.



"కాదు- అవసరం ఉంది తెప్పించండి. అలాగే ఇరవై మంది వంటవాళ్లు, నిర్మాణపు పని తెలిసిన పదిమంది కూలీలు కూడా కావాలి" అన్నారు వైద్య సోదరులు.

"ఉప్పు, పప్పు కూరగాయలు కూడా తెప్పించండి. వండి, ఊళ్ళో పోలేరమ్మ జాతర జరిపించండి- సరిపోతుంది" దెప్పి పొడిచాడు రాజవైద్యుడు.

"కాదు కాదు- మా వైద్యానికి ఇది చాలా అవసరం" అన్నాడు పుల్లన్న.

"ఏమి అవసరమో ఏమో! మా తిమ్మన గారితో ముక్కు పట్టించి మూడు చెరువుల నీళ్ళు త్రాగిస్తున్నారు. వారి యాత్ర యిక్కడే పూర్తి అవుతుందేమో!" అన్నాడు రాజవైద్యుడు.

"శివ శివా! మీకా సందేహం అక్కరలేదు. ఆయన సంపూర్ణ ఆరోగ్యవంతులై రాయలవారిని దర్శిస్తారు- తన కవిత్వం తో మెప్పిస్తారు" అన్నాడు సూరన్న ధైర్యంగా.

"ఎవరి గతి ఎలా వుందో ఆ విరూపాక్షుడికే ఎరుక" అంటూ దండనాయకుడికి పట్టీ యిచ్చి అన్నీ తెప్పించమన్నాడు రాజవైద్యుడు.

ఐదవనాటికల్లా గాలి కూడా చొరనంత దట్టంగా, బాగా ఎత్తుగా ఉన్న గుడిసె ఒకటి తయారైంది.

గుడిసె బయట వంటవాళ్ళు పుట్టెడు బియ్యాన్ని వండటం మొదలు పెట్టారు. ఊళ్ళో వాళ్లంతా వచ్చి నిలబడి 'ఏం జరుగుతున్నది' అని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

వైద్యులిద్దరూ వచ్చి తిమ్మనను గుడిసెలోకి పిలుచుకొని వెళ్ళారు.

"మిమ్మల్ని ఈ గుడిసెలో తలక్రిందులుగా వేలాడదీయాల్సి వుంటుంది" అన్నారు.

తిమ్మనకు దిక్కు తోచలేదు. ఎలా పారిపోవాలో అర్థం కాలేదు. ఏమనేందుకూ నోరురాక విలవిలలాడాడు.

"భయపడకండి- ఇది వైద్య ప్రక్రియలో భాగమే" అన్నారు వైద్య సోదరులు ఇద్దరూ ఏక కంఠంతో.

"సరే- ఒకసారి మీ వైద్యానికి ఒప్పుకున్నాక తప్పుతుందా, ఏదైతే అది అవుతుంది- కానివ్వండి" అన్నారు తిమ్మన.

వెంటనే వైద్యులు ఆయన శరీరం అంతటా లావు పాటి కంబళ్ళు చుట్టారు. తల, ముక్కు మాత్రం బయటకు ఉండేలా ఒక దట్టమైన తొడుగు తగిలించారు. గుడిసెకు ఒక మూలగా ఆయన్ని తలక్రిందులుగా వేలాడ దీశారు.

మరుక్షణం అప్పుడే వండి వార్చిన అన్నపు హండాలు గుడిసెలోని తేబడ్డాయి. ఆ అన్నం

అంతా గుడిసెలో కుమ్మరించబడింది. తలక్రిందులుగా వ్రేలాడుతున్న తిమ్మనగారి క్రిందంతా ఆవిర్లు క్రక్కుతున్న అన్నం నిండింది. గుడిసె మొత్తం ఒక్కసారిగా ఆవిర్లు క్రమ్ముకున్నాయి.

తన శరీరానికి ఏమైందో అసలు అర్థం కాలేదు తిమ్మనకు. ఆయన ముక్కు పుటాల ద్వారా లోనికి ప్రవేశించిన వేడి వేడి అన్నపు ఆవిరి సెగలు ఒక్క పెట్టున ఆయన నషాళానికి అంటాయి.

రెండు క్షణాలు గడిచాయో లేదో- ఆయన ముక్కు పుటాల నుంచి విష క్రిములు రెండు- గిజ గిజ లాడుతూ వెలువడి, ఆ అన్నపు రాశి పై పడ్డాయి. అదే క్షణంలో తిమ్మన స్మృతి తప్పాడు!

వైద్యులిద్దరూ వెంటనే ఆయనను క్రిందికి దింపి, బయటకు తీసుకొని వచ్చి, శీతలోపచారాలు చేశారు. క్రమంగా ఆయనను తెలివిలోకి తెచ్చారు. తిమ్మన తలనొప్పి మాయమైంది! అయితే ఆయన పూర్తిగా కోలుకునేందుకు మరో రెండు వారాలు పట్టింది.

కవిగారి శిరోభారం తగ్గిందనీ, రోగం నయమైందనీ వెంటనే రాయలవారికి కబురు అందింది. పుల్లాపంతుల వైద్య సోదరుల ఖ్యాతి వెనువెంటనే విజయనగర సామ్రాజ్యపు నలుమూలలకూ పాకింది. వారిని దర్శించుకునేందుకు ప్రజలు తండోప-తండాలుగా రాసాగారు.



నాలుగైదు రోజుల్లో కృష్ణదేవరాయల వారే నేరుగా బోదనంపాడు విచ్చేసారు.

వైద్యులిద్దరూ రాయలవారిని ప్రస్తుతించారు:

శ్రీ వేంకటగిరి వల్లభ-

సేవా పరతంత్ర హృదయ! చిన్నమదేవీ

జీవితనాయక!కవితా

ప్రావీణ్య ఫణీశ కృష్ణరాయ మహీశా! ప్రభూ మేము వైద్యులమేగానీ కవులం కాదు. అందుకే ముక్కు తిమ్మన గారి పద్యాన్నే ఒప్పజెప్పాం. అందుకు మమ్మల్ని మన్నించండి. మా పెద్దలు దయతో మాకు నేర్పించిన వైద్యాన్ని సేవాదృష్టితో మా బోదనంపాడులోనే పదిమందికీ అందిస్తూ వస్తున్నాం. నంది తిమ్మనగారంతటి వారికి వైద్యం చేసే మహద్భాగ్యం కలగడం కేవలం మా పుణ్య విశేషమే. వారి ఆశీస్సులు మాకు సదా వుండగలవని విశ్వసిస్తూ, తమరి అనుగ్రహంతో మా ఈ వైద్యవిద్య యిలాగే పది కాలాలపాటు శాశ్వత కీర్తి పొందగలదని భావిస్తున్నాము" అన్నారు పుల్లాపంతుల సోదరులు.

తిమ్మనగారు లేచి "ప్రభూ! శతాధిక వందనాలు.'కాశ్యాం తు మరణానురక్తి:- కాశీకి పోయేది కాటికి పోయేందుకే" అని నిశ్చయించుకొన్న నేను, వీరి చలువతో పునర్జన్మ ఎత్తాను. వీళ్ళు నా పాలిట నిజంగా అశ్వినీ దేవతలే. మొదట నేను వీరిని శంకించాను- అది నా అవివేకం. వీరి హస్తం ఒక సంజీవ కరణి. రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛ పోయినప్పుడు గనక వీరు అక్కడ ఉండి ఉంటే హనుమంతుడికి ఆ సంజీవనీ పర్వతాన్ని ఎత్తి తేవలిసిన పని ఉండేది కాదేమో. కుగ్రామంలో నిస్వార్థంగా వైద్యసేవలనందిస్తూ గ్రామంలో వారిని అందరినీ ఆరోగ్యవంతులుగా ఉంచుతున్న వీరి సేవకి ఎంత యిచ్చినా తక్కువే.



వీరి ఋణం ఎలా తీర్చుకోగలం? ప్రభువులవారు వీరిని తమ ఆస్థాన వైద్యులుగా నియమిస్తే సాహిత్యం తో బాటు వైద్యశాస్త్రాన్ని కూడా పోషించినట్లుంటుంది అని నా అభిప్రాయం. ఆ తర్వాత తమరి చిత్తం' అన్నారు.

"కవీశ్వరుల సూచన ఆమోదదాయకం. మరి

పుల్లాపంతుల సోదరులు అందుకు సమ్మతిస్తారో? వారి సమ్మతం మాకు సంతోషదాయకం" అన్నారు రాయలవారు. కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.

"ప్రభూ! మీ ఆజ్ఞ శిరోధార్యమే- కానీ మా వంశీకుల నియమానుసారం మేము స్వస్థలంలోనే వైద్యం చెయ్యాలి తప్ప, మరో చోటుకు పోగూడదు. ధన సంపాదనకూ, స్వలాభాపేక్షకూ లోనుకాకూడదు. మా గ్రామం వైద్యానికి పెట్టింది పేరుగా శాశ్వత కీర్తిని ఆర్జించాలని మా పెద్దల ఆశయం. ప్రభువులు దీన్ని వేరుగా తలచరాదని ప్రార్థన" అన్నారు ఆ సోదరులు.

"భేష్ ! మీ పూర్వీకుల ఆశయం ఉదాత్తంగా ఉంది. వైద్యుడి కోసం రోగి అన్వేషించడమే ధర్మం. అప్పుడే వైద్యానికి విలువ. మీ గ్రామాన్ని వైద్య కేంద్రంగా పరిగణిస్తూ బోదనంపాడును అగ్రహారంగా మీకు దానశాసనంతో వ్రాయించి ఇస్తున్నాం! అమూల్యమైన మీ సేవను ప్రశంసిస్తూ మేమిచ్చే ఈ చిన్న బహుమతిని స్వీకరించండి" అన్నారు రాయలవారు గంభీరంగా. సభలో మరోసారి హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

**ఆంధ్రాంగ్లం!**

వెంగళప్ప ఇంగ్లీషు పేపరు చదువుతున్నాడు...

వెంగళప్ప: "ఇండియన్ అథ్లెట్ లాస్ట్ గోల్డ్ మెడల్ ఇన్ లాంగ్ జంప్!" లాంగ్ జంప్ చేస్తూ గోల్డ్ మెడల్ పోగొట్టుకున్నాట్ట!

వెంగళప్ప కొడుకు: తెలివి తక్కువతనం కాకపోతే...లాంగ్ జంప్‌కి వెళ్ళేప్పుడు గోల్డ్ మెడల్ వేసుకొని వెళ్లాల్సిన అవసరం ఏమొచ్చిందట, వడ్డారం కాకపోతే?!

**జ్ఞాని!**

పిట్ట: నువ్వు చాలా కష్టపడి తేనె తయారు చేస్తే మనుషులు దాన్ని దొంగలిస్తారు. బాధగా అనిపించదా?

తేనెటీగ: బాధ ఎందుకు? తేనెను దొంగలించగలరేమో గానీ, తేనెని తయారు చేసే విద్యను దొంగలించలేరుగా?!



# బాకీ

*మూలం: 'సీక్రెట్ ఆఫ్ ద ప్లేన్ ట్రీ'* *రచన : లాతిఫ్ మఖ్ముడోవ్*

*అనుసృజన - రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ బడి, మదనపల్లి.*

**1**

మా ఇల్లు ఉండేది ఒక నదికి దగ్గర్లోనే. ఆ నది ఒడ్డునే ఒక పెద్ద రావి చెట్టు ఉంది. విశాలమైన కొమ్మలతో తెరిచిన గొడుగులా ఉంటుందది. ఆ చెట్టు వయసు మూడు వందల సంవత్సరాలు అనీ, చెట్టు తొర్రలో పాములుంటాయనీ చెప్పుకునేవాళ్ళు మా ఊరి జనం. కానీ అది నిజం కాదు. నేను, రహ్మాన్ కలిసి ఆ చెట్టు ఎక్కి, దాని తొర్రల్లోకి దిగి చూశాం కూడా. పాములు లేవు; పురుగులు లేవు. ఊరికే బూజు వాసన వేస్తూ కొద్దిగా చెమ్మగా ఉంటుందక్కడ- అంతే. కాకపోతే లోపలికి వెళ్ళినప్పుడు చీకటి వల్ల భయంగా ఉంటుంది.

ఆ చెట్టు క్రింద ఒక మట్టి దిబ్బ ఉంది.

సలీమ్ అనే ముసలాయన ఎప్పుడూ ఆ దిబ్బ మీద కూర్చుని ఉంటాడు. మా ఇంటి వెనక ప్రహరీ గోడ ఆ దిబ్బకి ఆనుకుని ఉంది. సలీమ్ తాత రోజూ ఉదయం నుండి రాత్రి వరకూ అక్కడే కూర్చొని నది వైపు చూస్తూ, జోగుతూ ఉంటాడు.



'తాతకు అక్కడ ఏమి కనపడుతున్నదో' అని నేను ఒక్కోసారి ఆశ్చర్యపోయేవాడిని. అయినా ఆయనకు అదేదో పిచ్చి అయి ఉండాలి- చూసేందుకు మా నదిలో ఏమీ లేదు- కనీసం ఒక్క చేప కూడా కనిపించదు! నా అంచనా ఏమిటంటే- సలీమ్ తాత 'అంతు చిక్కని అంతరంగం కల ముదుసలి'. (ఈమాట నేను చదివిన ఓ పుస్తకంలోదిలే). ఆయన ఆలోచనలు నాకే అర్థం కాక నేను ఏడుస్తుంటే, మరో ప్రక్కన నా స్నేహితుడు రహ్మాన్ ఆయన్ని గురించిన ప్రశ్నలతో నన్ను ఊపిరి తీసుకోనివ్వడు:

“ఆ చెట్టులో ఏదో రహస్యం ఉంది.. లేకుంటే రాత్రి, పగలు కాపలా కాయడు. అయితే రహస్యం చెట్టు తొర్రల్లో లేదు- లోపల అంతా వెతికి చూశాం కదా, మనం?! అది ఇక్కడే ఎక్కడో ఉంది" అన్నాడు రహ్మాన్.

“అదేం లేదు, అలా చూస్తూ ఆ దిబ్బ మీద కూర్చోవడం అతనికి కాలక్షేపం. ఒక్కొక్క బఠానీ తింటూ నది వైపు చూస్తూ సంవత్సరాల కాలం గడుపుతున్నాడు ఆయన" అన్నాను నేను.

రహ్మాన్ ఒక్క సారిగా గంతు వేసాడు- "ఆఁ! నువ్వు మట్టి దిబ్బ అనేసరికి నాకు అర్థం అయిపోయింది! రహస్యం ఏదో ఆ మట్టి దిబ్బ క్రిందే ఉంది. నాకు గట్టి నమ్మకంగా కూడా ఉంది! నిజం!! ఎంతకైనా పందెం!" అన్నాడు హుషారుగా.

"మట్టి దిబ్బ క్రిందనా?!” అడిగాను నేను,

అనుమానంగా.

"అవును మురాద్! నువ్వే ఆలోచించు!! సలీమ్ తాత మనల్ని ఎవ్వర్నీ ఆ దిబ్బ దగ్గరికి కూడా రానీయడు. అక్కడే కూర్చొని ఉంటాడు; రాత్రింబవళ్ళూ దానికి కాపలా కాస్తాడు. బాగా ఆలోచించి చూడు- అతను ఆ దిబ్బ క్రింద ఏదో రహస్యాన్ని దాచి ఉంచుతున్నాడని అర్థం అయిపోతుంది నీకు కూడా!!" అన్నాడు రహ్మాన్.

నేను మౌనంగా తల ఊపాను. "అవును! రహ్మాన్ చెప్పాక నాకు ఇప్పుడు ఆ సంగతి గోడ మీద రాసినంత స్పష్టంగా కనిపిస్తున్నది. ఈ ఆలోచన నాకు ఎందుకు రాలేదు ఇంతవరకూ?! రహ్మాన్ ఎప్పుడూ నేర పరిశోధన పుస్తకాలు చదువుతుంటాడు. అందుకే అతనికి ఈ ఆలోచన తట్టి ఉంటుంది.."

ఆలోచనల్లో పడ్డ నన్ను రహ్మాన్ తనకి దగ్గరగా లాక్కొని, సలీమ్ తాత వైపు చూపిస్తూ గుసగుసలాడాడు- "జాగ్రత్తగా విను మురాద్, మనం ఆ దిబ్బని త్రవ్వి, దాని రహస్యం ఏంటో కనిపెడితే మనకి పరీక్షలో మొదటి మార్కు వస్తుంది. ఆ తర్వాత మన ఉపాధ్యాయులు ఇంక మనల్ని ఏ ప్రశ్నలూ కూడా అడగరు. అసలు శాస్త్రజ్ఞులు శాస్త్రజ్ఞులు ఎట్లా అవుతారో తెలుసా, నీకు? ముందు ఏ పాత కుండ పెంకులో, ఇనుప గొడ్డళ్ళో భూమి నుండి త్రవ్వి తీస్తారు వాళ్ళు. ఆ తర్వాత దానికి కొంచెం చరిత్ర జోడించి, అట్లా శాస్త్రజ్ఞులు అవుతారు- తెలుసా?! మనం కూడా ఈ దిబ్బలో ఉన్న రహస్యాన్ని త్రవ్వి తీస్తే శాస్త్రజ్ఞులం కావొచ్చు, ఏమంటావు?" అన్నాడు.

'శాస్త్రజ్ఞులు కావడం అంత సులభం కాదు' అని నేను చాలా సార్లు విన్నాను- కానీ ఇప్పుడు రహ్మాన్ మాటల వల్ల నాలో కోరిక మొదలైంది- "నిజమే అనుకుంటాను; కానీ..." అన్నాను.

"ఏమిటి, నీ సందేహం?" అన్నాడు రహ్మాన్ చిరాగ్గా.

"సలీమ్ తాత అన్ని సమయాల్లోనూ దాని మీదే కూర్చుని ఉంటాడు. ఇంక అక్కడ త్రవ్వేది ఎలా?" అన్నాను నేను.

"హా! దానిదేముంది, అది రెప్పలార్పినంత

సులభం. నువ్వు నేను చెప్పినట్లు చెయ్యి, చాలు!" అన్నాడు రహ్మాన్.

నాకు ఎందుకో వాడి ఈ ముచ్చట అంతా కొంచెం ఇబ్బందికరమేమో అనిపించింది. అయినా ఒప్పుకోక తప్పేట్లు లేదు- "ఇందులో మోసపు పనులు ఏమీ లేవు కదా?" అన్నాను.

"ఇందులో మోసం ఏముంది? మనం మీ తోట లోపలి వైపు నుంచి ఆ మట్టి దిబ్బ వరకు సొరంగం తవ్వుదాం. ఆ సొరంగం కూడా ఏమంత పెద్దది కాదు. వేస్తే తీస్తే బహుశా రెండు మీటర్లు ఉంటుందంతే. మెల్లమెల్లగా త్రవ్వుకుంటూ పోతే నేరుగా తాత కూర్చున్న చోటుకు చేరతాము; రహస్యం ఏంటో తెలిసిపోతుంది. ఒకవేళ ఏమీ కనిపించలేదనుకో; సొరంగాన్ని మామూలుగా పూడ్చి పెట్టేద్దాం, అంతే! అదేమంత పని కాదు!" అన్నాడు వాడు.

నేను హుషారుగా "సరే" అన్నాను.

## 2

ఇద్దరం మా పెరట్లోకి చేరాం. నేను మా పలుగు-పార తెచ్చాను. అప్పటికప్పుడే పని ప్రారంభించాము. ఐదు రోజులపాటు సొరంగం త్రవ్వాము. రహ్మాన్ సొరంగంలో ఉండి త్రవ్వేవాడు. మన్నును బక్కెట్ లో నింపి ఇచ్చేవాడు. ఆ ఇసకను, మన్నును బయటికి తీసుకెళ్ళి దూరంగా పారబొయ్యటం నా పని. ఆ సమయంలో నిండా మన్నుతో కప్పబడిపోయిన మా శరీరాలని చూస్తే మాకే నవ్వు వచ్చేది. ఏమంటే ఇదంతా ఏమాత్రం సద్దు లేకుండా చేయవలసి వచ్చింది - సలీమ్ తాత గోడ అవతలే దిబ్బ మీద కూర్చుని ఉన్నాడుగా, మరి?!

ఆరో రోజు త్రవ్వుతూ పోతుంటే హఠాత్తుగా పారకి ఏదో గట్టిగా తగిలినట్లు శబ్దం అయింది. రహ్మాన్ వగరుస్తూ "ఇంక ఇప్పుడు త్రవ్వటం ప్రమాదం. ఇంక కాసేపట్లో సలీమ్ తాత భోజనానికి వెళ్తాడు.. ఆయన అట్లా వెళ్ళగానే మళ్ళీ మొదలు పెట్టచ్చు

మనం. పని దగ్గర పడింది. ఇంక ఒకటో రెండో బక్కెట్ల మన్ను తీస్తే చాలు- రహస్యం బయట పడుతుంది. గోడ మీద నుండి చూడు.... సలీం తాత గానీ ఈ శబ్దాన్ని విన్నాడో, ఏమో!" అన్నాడు గుసగుసగా.



నేను గోడ మీద నుండి తొంగి చూశాను.

తాత కదలకుండా దిబ్బ మీద కూర్చుని ఉన్నాడు. ఏదో పుస్తకం-ఒక్కో పేజీ చదువుతున్నాడు; ప్రక్కనే పాత్రలో ఉన్న 'టీ' ని చప్పరిస్తున్నాడు. శబ్దం ఏమీ విన్నట్లు లేదు.

"అబ్బబ్బ! ఆ పనికిమాలిన పుస్తకం చదివి ఏం చేస్తాడట, ముసలాయన? భోజనం సమయం అయింది గదా; ఇంక వెళ్తేనేమి?" అన్నాడు రహ్మాన్ అసహనంగా.

మాకు కూడా చాలా ఆకలిగా ఉంది. 'తాత వెళ్ళేలోగా ఏదైనా తిని వద్దాం' అని మేమే ముందుగా ఇంట్లో లోపలికి వెళ్ళాం. ఏదో కొంచెం తిని వచ్చేప్పటికి సలీమ్ తాత దిబ్బ మీద లేడు!

నేను, రహ్మాన్ గబగబా సొరంగంలోకి వెళ్ళి త్రవ్వి చూశాం. అక్కడొక పింగాణీ కూజా ముక్క, మట్టి గొట్టుకుని ఉన్న గొర్రె ఎముక తప్ప ఏమీ లేవు.

"సరే- ఇంకొంచెం త్రవ్వి చూద్దాం. ముందు ఈ మన్నుని బయట పోసి రా!" అంటూ నా చేతికి బక్కెట్ ఇచ్చాడు వాడు. నేను బక్కెట్టు తీసుకుని బయటికి వచ్చానో లేదో- దబదబామంటూ శబ్దం- నా గుండె పగిలినట్లు అనిపించింది. బక్కెట్టు క్రింద పడేసి వెనక్కి తిరిగి చూసేసరికి, రహ్మాన్ ప్రాకుతూ వస్తున్నాడు నేలలోంచి. అక్కడ మేం త్రవ్విన సొరంగమే లేదు! వాడి ఒంటి నిండా మట్టి- భయంతో నా ఒళ్ళు

చల్లబడిపోయింది.

“మట్టి తిన్నె కూలిపోయింది! ఒక వారగా అదంతా విరిగి పడిపోతుండటం కనిపించింది నాకు! దాంతో గభాల్న చివరి క్షణంలో తప్పించుకున్నాను. లేకపోతే సజీవంగా సమాధి అయిపోయి ఉండేవాడిని!" అన్నాడు వాడు రొప్పుతూ.

నేను ఆందోళనగా గోడ ఎక్కి చూశాను. మట్టి దిబ్బ విరిగిపడి, చెట్టు క్రింద తొర్రలాగా ఏర్పడి ఉన్నది. 'ఇంకా నయం- ఆ ముసలాయన వెళ్ళిపోయాడు. లేకపోతే ఆయన కూడా గుంటలో పడిపోయేవాడు; గొప్ప ప్రమాదమే జరిగి ఉండేది'.

"హమ్మయ్య, తాత అక్కడ లేడు- మంచిదయింది!" అన్నాను ఊపిరి పీల్చుకుంటూ.

“సరేలే! త్వరగా రా! అందరూ వచ్చి చూడకముందే మనం సొరంగాన్ని మూసేయాలి!" అన్నాడు రహ్మాన్.

"మరి మట్టి దిబ్బ మాటేమిటి?" అన్నాను అతని వైపు పిచ్చివాడిలాగా చూస్తూ.

“దాని కాలం చెల్లి కూలిపోయిందని అనుకుంటారు- ఏమీ పర్లేదు. అయితే మనం ముఖ్యంగా గోడ ఇవతలి ప్రక్కన ఉన్న సొరంగాన్ని మూసివేయాలి, దా! దా!” అన్నాడు.

మేము గబగబా సొరంగాన్ని మట్టితో నింపి గట్టి చేసాం. తోట మూలన ఉన్న పాత కొయ్యలని లాక్కొని వచ్చి దాని మీద కప్పాం.

అంతలో తాత వస్తున్న అలికిడి అయ్యింది. ఇద్దరం గోడ మీదికి ఎక్కి, నక్కి చూశాం. సలీమ్ తాత చెట్టు దగ్గర నిలబడి, తొర్రలోకే చూస్తున్నాడు. అతని ముఖంలో దీనత్వం మాకు స్పష్టంగా కనపడుతోంది. అతనిప్పుడు వంగి, అక్కడ ఉన్న మట్టి పెళ్ళలని అటూ ఇటూ తొలగించేందుకు ప్రయత్నిస్తున్నాడు. కొద్ది సేపు ప్రయత్నించాక అది అసాధ్యం అనిపించినట్లుంది- నిస్పృహాయంగా అటు ఇటు చూసి, కాసేపు అట్లాగే నిలబడి ఏడ్చాడు. ఆపైన తేరుకొని, మెల్లగా చేతులు ఊపుకుంటూ వెళ్ళిపోయాడు. వెళ్ళేప్పుడు అతని కాళ్ళు తడబడి, చాలా సార్లు పడబోయాడు.

మేమిద్దరం ఒకరి ముఖాలు ఒకరం చూసుకోలేకపోయాము. మోకాళ్ళ మీద తల ఆన్చి మౌనంగా బొమ్మ మాదిరి అలాగే చాలా సేపు కూర్చుండిపోయాడు రహ్మాన్.

వణికే చేతులతో తాత మట్టి పెళ్ళలను తొలగించడానికి ప్రయత్నించటం, ఎత్తలేక ఏడవటం- ఆ దృశ్యం నా కళ్ళ ముందే మెదల సాగింది. నా గొంతులోంచి మాట పెగలలేదు. చాలా బాధ వేసింది.

కాసేపటికి రహ్మాన్‌తో "ఏంటి, నువ్వు చేసిన పని?!" అన్నాను.

"అంటే తప్పంతా నాదేనంటావా? ఆ పాత మట్టి దిబ్బ కూలితే దానికి నేనే బాధ్యుడినా?" అన్నాడు బాధగా.

"అవును- ఇదంతా నీ పిచ్చి భ్రమల వల్లనే కదా, జరిగింది!" అన్నాను.

"అయినా నేనేమీ నిన్ను బలవంతం చేయలేదే! నీకై నువ్వు కూడా 'దిబ్బ క్రింద ఏముందో చూద్దాం' అని వచ్చావుగా?" అన్నాడు వాడు. నేను ఏమీ మాట్లాడలేదు.

"ఇంకా అదృష్టవంతులం- మనల్ని ఎవరూ చూడలేదు. ఇప్పుడు నువ్వు 'ఇదంతా నా వల్లే జరిగింది' అని అందరికీ టాం టాం వేస్తావా?" రహ్మాన్ గొంతు ఏడుపుతో బొంగురుపోయింది. కళ్ళ నీళ్ళు తుడుచుకుంటున్నాడు. నాకు వాడిమీద జాలి వేసింది. మట్టి తిన్నె విరిగి పెళ్ళలు మీద పడ్డప్పుడు కూడా వాడు అరవలేదు- నిశ్శబ్దంగా ఓర్చుకుని ఉండిపోయాడు.

నేను అనునయంగా వాడి భుజం మీద చెయ్యి వేసి "రహ్మాన్, ఊరుకో. బాధపడకు. ఇందులో నా తప్పు కూడా ఉందిలే; అసలు మనం సొరంగం త్రవ్వకుండా ఉండాల్సింది" అన్నాను.

ఎవరి ఆలోచనల్లో వాళ్ళం కాసేపు అలాగే కూర్చుని, లేచి, ఎవరింటికి వాళ్ళం వెళ్ళిపోయాం.

## 3

ఇంటికి వెళ్ళాక కూడా మనసు అదోలాగా ఉండింది. ఏదైనా చదువుకుందామని పుస్తకం చేతిలోకి తీసుకున్నాను కానీ ఒక్క పేజీ కూడా ముందుకు నడవలేదు.

సాయంత్రం అవుతుండగా నాన్న ఇంటికి వచ్చాడు. మామూలుగా సరదాగా ఉండే నాన్న ఇవాళ్ళ ఎందుకనో దిగులుగా ఉన్నాడు. ఇంకా దుస్తులు మార్చుకోలేదు- వచ్చిన కాసేపటికే అమ్మతో కలిసి మళ్ళీ బయటికి బయలుదేరాడు.

వెళ్తూ వెళ్తూ అమ్మ అన్నది- "మురాద్! ఈరోజుకి నువ్వే భోజనం వడ్డించుకుని తినెయ్యి. మేం సలీమ్ తాత వాళ్ళ ఇంటికి వెళుతున్నాం. ఆయన- పాపం, జబ్బు పడ్డాడట. డాక్టరుగారిని పిలుచుకు వచ్చి చూపించాలి. ఏమైనా ఆహారం కూడా తయారు చేసి తినిపించాలి. వచ్చేప్పటికి మాకు ఆలస్యం అవుతుంది" అంది.

సరేనన్నట్లుగా తల ఊపాను.

నేను ఏదో కాస్త తిని అమ్మనాన్నల కోసం ఎదురు చూస్తూ పడుకున్నాను. యుగాలు గడిచినట్లుగా ఉంది. బయట అంతా చీకటి. గడియారం పది గంటలు కొట్టటం వినబడింది. నాకు తెలియకుండానే నిద్రలోకి జారుకున్నాను.

ఉదయాన్నే రహ్మాన్ వచ్చి లేపాడు. వాడి ముఖం వాడిపోయి ఉంది.

“నాకు రాత్రంతా నిద్ర పట్టలేదు. ఏవేవో పీడకలలు వచ్చాయి!" అన్నాడు. వాడి గొంతు వణుకుతోంది.

“సలీం తాత జబ్బు పడ్డాడట. రాత్రి అమ్మనాన్న డాక్టర్ని పిల్చుకొచ్చేందుకు వెళ్ళారు. ఆయన ఎలా ఉన్నాడో ఏంటో. నీకేమైనా తెలుసా?” అడిగాను.

“తెలుసు, మా అమ్మ కూడా ఇప్పుడు తాత దగ్గరే ఉంది-" అన్నాడు వాడు.

“మనం కూడా వెళదాం పద. తాతకి పాపం, లడ్డూలంటే చాలా ఇష్టం. కొన్ని లడ్డూలు తీసుకు వెళ్దాం-" అన్నాను.

ఇద్దరం తాత ఇంటి వైపుకి నడుస్తుంటే వెనక నుండి లారీ వచ్చి ఆగింది. అందులో మా నాన్న ఉన్నాడు- పట్టణం నుండి ఇటుకలు తెస్తున్నాడు.

“ఎక్కడికబ్బాయ్, బయలు దేరారు?” అన్నాడు నాన్న, లారీని మాకు ప్రక్కగా ఆపించి.

“సలీం తాతకు లడ్డూలు ఇచ్చి వద్దామని వెళ్తున్నాం" అన్నాను.

"సరే రండి, లారీకూడా ఆ వీధిలోకే వెళ్తున్నది" అని మమ్మల్ని లారీలోకి ఎక్కించుకున్నాడు నాన్న.

లారీ డ్రైవర్‌తో నాన్న సలీమ్ తాత గురించే చెప్తున్నాడు. నన్ను చూపిస్తూ "..వీడు అప్పుడు నెలల బాబు. మీ ఒదిన వీడిని ఎత్తుకొని నది ఒడ్డున నడుస్తున్నదా, ఒక్కసారిగా కాలు జారి, దొర్లుకుంటూ వెళ్ళి, నదిలో పడింది- పిల్లాడితో సహా! సరిగ్గా ఆ సమయానికి ఒడ్డున నిలబడి ఉన్నాడు సలీం తాత కొడుకు మహమూద్. వాడు నీళ్ళల్లోకి దూకి తల్లిని-వీడిని ఇద్దరినీ కాపాడాడు. లేకపోతే వీళ్ళిద్దరూ దక్కేవాళ్ళుకాదు నాకు-"

"అయితే వెంటనే మహమూద్‌కి- ఆ నీళ్ళ వల్లనే- చలి జబ్బు ఏదో పట్టుకుంది. అందరం ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. మహమూద్ మాకెవ్వరికీ దక్కకుండా పోయాడు. సలీం తాతకి ముసలితనంలో కొడుకు ఆసరా లేకుండా పోయింది.. మహమూద్ కవితలు రాసేవాడు. తను రాసిన కవితలతో ఓ పుస్తకాన్ని కూడా ప్రచురించి ఉన్నాడు అప్పటికే. సలీం తాత దగ్గర కొడుకుకు గుర్తుగా వాడు రాసిన పుస్తకం కాపీ ఒక్కటి మాత్రమే మిగిలింది. వాడు రాసిన కవితల్ని చదువుకుంటూ ఎప్పుడూ ఆ చెట్టు క్రింద దిబ్బ మీద కూర్చోసాగాడు ఆయన. మేం ఊరికే చూడటం తప్ప ఇంకేమీ చెయ్యలేకపోయాం.."

నాన్న కొనసాగించాడు.

"..నిన్న ఆ దిబ్బ కూలిపోయింది. మహమూద్ రాసిన పుస్తకాన్ని చదువుతూ చదువుతూ ఆ దిబ్బమీదే పెట్టుకున్నాడట సలీం తాత. అది కూడా ఇప్పుడు ఆ మట్టిలో కలిసిపోయింది. 'ముసలాయన ఆ పుస్తకం కోసం దిగులేసుకున్నాడేమో- ఎవరైనా కొంచెం వెతికి పెట్టండి' అన్నాడు డాక్టర్. రేపన్నా సమయం చూసుకుని వెళ్ళి ఆ పుస్తకం కోసం వెతకాలి.." అని నాన్న అన్నాడు.

వింటున్న నాకు గుండె చెరువయ్యింది. తెలియకుండానే నా కళ్ళ వెంట నీళ్ళు కార-సాగాయి.

అంతలోనే లారీ ఆగింది. క్రిందికి దిగగానే రహ్మాన్ నా చెయ్యి పట్టుకుని "ముందు మీ ఇంటికి వెళ్దాం పద- మట్టి దిబ్బ క్రింద తాత పుస్తకం కోసం వెతకాలి" అన్నాడు. వాడి ముఖం కూడా తడి తడిగా ఉంది.



“అవును పద! పుస్తకంతో సహా వద్దాం, అప్పుడు తాత సంతోషంతో లేచి కూర్చుంటాడు" అన్నాను. ఇద్దరం గబగబా వెనక్కి పరుగెత్తాం.

“ఎంత సేపు!? రెండు పారల మట్టి తీశామంటే క్షణంలో పుస్తకం దొరుకుతుంది" అన్నాను.

“ఏమిటీ, పారతోనా!? లేదు లేదు-ఇది పుస్తకం. మనం మట్టిని జాగ్రత్తగా చేతుల్తోటే తీయాలి!" అన్నాడు రహ్మాన్.

“అవును కదా!” అన్నాను.

దిగబడిపోయిన దిబ్బ దగ్గరికి వెళ్ళి, జాగ్రత్తగా చేతులతో మట్టిని తీయడం మొదలుపెట్టాం. దాదాపు మూడు గంటలు పని చేయగా మాకు పుస్తకం కనిపించింది. దాన్ని చూడగానే మాకు ప్రాణం లేచి వచ్చినట్లు అనిపించింది.

దాన్ని జాగ్రత్తగా పైకి తీసి, మట్టి దులిపి, మడత పడిన పేజీలను సరిచేశాం. మా అదృష్టం కొద్దీ పుస్తకానికి ఏమీ కాలేదు!

“పద! వెంటనే వెళ్ళి తాత బాకీ తీరుద్దాం. నేను పుస్తకాన్ని ఇస్తాను; నువ్వు లడ్డూలు ఇవ్వు" అన్నాడు రహ్మాన్.

“కాదు కాదు, నేను పుస్తకాన్ని ఇస్తాను. నువ్వు లడ్డూలు ఇవ్వు!" అన్నాను నేను.

"సరేలే, ఆయనకి క్షమాపణలు చెప్పుకుని, మనిద్దరి చేతులూ పుస్తకం మీద వేసి ఇద్దాం" అన్నాడు రహ్మాన్ నవ్వు ముఖంతో.

మాకిద్దరికీ తెలుసు- ఇక సలీం తాతకేమీ భయంలేదు! 

# పదరంగం-84

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | 4 |
| | ★ | | ★ | 5 | |
| 6 | 7 | | 8 | ★ | |
| 9 | | ★ | 10 | 11 | |
| ★ | 12 | 13 | ★ | 14 | |
| 15 | ★ | 16 | | ★ | |

**అడ్డం:**

1. సీతాదేవి పుట్టిన నగరం (6)

5. తెలుగులో 'కలర్' ! (2)

6. పూర్వపు కాలపు విద్యాలయాలు! (4)

9. రుక్మిణీ దేవి అన్న! (2)

10. పలకపైన రాసేది?! (3)

12. తిరగబడిన 'రాణి' (2)

14. ఇవాళ్ళ, మరో విధంగా! (2)

15. హిందువులు పవిత్రంగా భావించే అక్షరం (1)

16. తలపై ఉండేది (2)

**నిలువు:**

1. వెలుగులు చిందించే పురుగు (4)

2. తడబడిన 'కులాస' (3)

3. హిందీ 'వేడి' (2)

4. హోలీనే, మరో రకంగా! (6)

7. శ్రీ కృష్ణుడి పెద్ద భార్య! (3)

8. తల క్రిందులైన 'బలం' (2)

11. తిరగబడిన 'నేల' (2)

13. రాజ్యాన్ని ఏలే ప్రభువు! (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 85 ని బహుమతిగా పంపిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వోఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515101

**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**




రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:

వ్యక్తులకు: **300/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

సంస్థలకు: **350/-**

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం అక్కౌంటు వివరాలు:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBHY0020902

Transfer వివరాలను మాకు మెయిల్ ద్వారా తెలియజేయండి: team@ kottapalli.in

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్సుఫర్ చేయగలరని ప్రార్థన)

**ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:**

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 set | 9 | 22 | 180 |
| 2 | 2012 Set | 11 | 27 | 220 |
| 3 | 2013 Set | 7 | 22 | 175 |
| 4 | 2014 Set | 10 | 500 | 250 |
| 5 | 2015 Set | 7 | 1150 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/07/2016 Postal Regn No: HDP/008/2015-2017

# చైతన్యం

-కంతుల అనిల్, తొమ్మిదవ తరగతి, జడ్.పి.హెచ్.యస్. ముస్తాబాద్, కరీంనగర్ జిల్లా.

చుక్కాపూర్‌లో హైస్కూలు లేదు. ఆ ఊరి పిల్లాడు వెంకటేష్ కామారెడ్డిలో హాస్టల్‌లో ఉండి చదువుకునేవాడు. ఎండాకాలం సెలవులు ఇచ్చేసరికి తమ సొంత ఊరు చుక్కాపూర్ వచ్చాడు. ఊరి పరిస్థితి చూసి చాలా ఆశ్చర్యపోయాడు. గ్రామం అంతటా చెత్త అలుముకొని ఉన్నది. తాము ఉండే కాలనీలో కూడా అంతా చెత్తాచెదారం! దాని మూలంగా ఊళ్ళో అందరికీ అనారోగ్యాలు!

వెంకటేష్ ఊళ్ళో జనాలందరినీ ఒకచోట పోగు చేసి చెప్పాడు: "చూడండి అన్నలూ, అక్కలూ, తమ్ముళ్ళూ, చెల్లాయిలూ! మన కాలనీనే కాదు; ఊరు ఊరంతా చెత్తతోటీ మురికితోటీ నిండి ఉన్నది. మనకు వచ్చే అనేక రోగాలకు ఈ చెత్తే కారణం. దీన్నంతా తీసి శుభ్రం చేసే పని ఎవరిది? ఎవరో వస్తారని, ఏమో చేస్తారని మనం అందరం ఎదురుచూస్తూ కూర్చుంటే సమస్య పోతుందా? పోదు. పరిశుభ్రత మన బాధ్యతే. ఇది 'మన పని' అనుకొని మనం నిర్వర్తించపోతే దానికి బలి అయ్యేది మన ఆరోగ్యమే! ఇలా కుదరదు. మనం అందరం ఇవాల్టి నుండి మొదలు పెట్టి మన ఊరికి శుభ్రం చేసుకుందాం" అన్నాడు.

"అది మా పని కాదు. పంచాయితీ పని" అన్నారు కొందరు.

వెంకటేష్ వాళ్లందరినీ ఒప్పించేందుకు చాలా శ్రమపడ్డాడు. అతని చొరవవల్ల ఊళ్ళో జనాలు- ముఖ్యంగా పిల్లలు- ఒక్కరొక్కరుగా- తమ పరిసరాల్ని శుభ్రం చేసుకునేందుకు నడుం కట్టారు. పిల్లలంతా పోగుచేసి పెట్టిన చెత్తను వెంకటేష్ తమ ట్రాక్టరులో ఊరి చివరికి చేర్చాడు. వారి ఉత్సాహాన్ని చూసిన పెద్దవాళ్ళు పూనుకొని ఊళ్ళో మురికి కాలువలను శుభ్రం చేసారు. చూస్తూ చూస్తూండగానే ఊరంతా మెరిసిపోయింది!

నెల తిరిగే సరికి ఊళ్ళోవాళ్ళ ఆరోగ్యాలు బాగుపడ్డాయి. అందరికీ నిజంగా ఆశ్చర్యమైంది. అందరూ ఎవరికి వాళ్ళు "పరిశుభ్రత- మనందరి బాధ్యత" అనుకోవటం మొదలైంది. ఊరంతా పరిశుభ్రంగా ఉండటంతో, చుక్కాపూర్ గ్రామం ఎన్నో గ్రామాలకు ఆదర్శంగా నిలిచింది. "స్వచ్ఛ గాఁవ్"అవార్డు సాధించుకున్నది. చుక్కాపూర్ విజయం మనందరికీ స్ఫూర్తిదాయకం.

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at "Kottapalli", 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.